





వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాటిది.

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్, మద్రాసు-14

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళనాడుకు ఏజంట్లు :

సీతారామ జనరల్ స్టోర్స్, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.

---

## గృహలక్ష్మి జయంతి దృశ్యాలు



వస్త్ర, అన్నప్రదానముల యనంతరము కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్ ఉద్యోగ పరివార బృందము, గృహలక్ష్మి కంకణ గృహీత మున్నగువారు గల చిత్రము.



శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్‌కు యీ ఏటి గృహలక్ష్మీ స్వర్ణకంకణమును బహూకరించి సన్మానించినప్పటి దృశ్యము.




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యస్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య



# ఈ ఏటి గృహలక్ష్మి స్వర్ణకంకణం



ఎప్పటియట్లు ఏప్రెలు 26-వ తేదీ నాడు పూజ్యబాబు కేసరిగారి జన్మదినోత్సవ సందర్భమున శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్‌గారికి గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానం జరిగింది.

శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్ విదుషీమణి, రచయిత్రికూడాను. ఈమె సుప్రసిద్ధ సంఘసేవకురాలు, జాతీయవాది, కవయిత్రి, భాగవతోత్తమురాలు అయిన స్వర్గీయ శ్రీమతి యామినీ పూర్ణతిలకమ్మగారి కుమార్తె. ఆమె తండ్రి సంగీతవిద్వాంసుడు శ్రీ నిరాఘాటం రామకోటయ్యగారు.

మహిళాభ్యుదయాన్నుద్దేశించి, జాతీయరంగంలో అన్నివిధాల స్త్రీలను ప్రోత్సహించి విద్యావిజ్ఞానములు పెంపొందడానికి, సంఘములో సముచిత స్థానము లభించి

పురుషులతోబాటు గౌరవప్రదంగా జీవయాత్ర సాగించడానికి అనువుగా మార్గాల నన్వేషించి కృషిసల్పినవారిలో పూజ్యులు కేసరిగారు పేర్కొనదగినవారు. వారి కృషికి నిదర్శనంగా వెలసినవే గృహలక్ష్మి పత్రిక, గృహలక్ష్మి స్వర్ణకంకణమున్నూ.

డాక్టరు కేసరిగారు సంస్థలద్వారాను, వ్యక్తులకును విశేషంగా సహాయంచేసి అనేకమంది స్త్రీల అభివృద్ధికి తోడ్పడ్డారు. మహిళా ఉద్యమవ్యాప్తికి, యీనాటి మహిళాభ్యుదయానికి, సంఘంలో యీనాటి మెరుగైన పరిస్థితులకు పూజ్యులు కేసరిగారొనర్చిన సేవ చిరస్మరణీయమైనది.

స్వయంగా 'గృహలక్ష్మి' పత్రికను 1928-లో స్థాపించి, నిర్వహించి, కళ, సాహిత్యరంగాలలో ప్రావీణ్యముగలవారికి గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము నేర్పాటు చేయడం ఆయనకు మహిళాపురోభివృద్ధిపట్ల గల ఆసక్తికి నిదర్శనము.

గృహలక్ష్మి పత్రిక ద్వారా అనేకమంది అభ్యుదయ రచయిత్రులు, రచయితలు రూపొందారు. మహిళాభ్యుదయమును, జాతీయోద్యమమును ఆనాడు, యీనాడు అనే విచక్షణ లేకుండా ప్రోత్సహించుచున్నది 'గృహలక్ష్మి'. జాతీయశ్రేయస్సు, సౌభాగ్యము ప్రాతిపదికలుగా గృహలక్ష్మి నిర్వహించబడుచూ మీ అందరి ఆదరాభిమానములకు పాత్రమగుచున్నది.

ఈ సందర్భమున ఆదరించి, అభిమానించి నిరంతరము మా శ్రేయోపురోభివృద్ధుల నపేక్షించిన పూజ్యబాబు కేసరిగారికి మా భక్త్యంజలి ఘటిస్తూ, బాలల సాహిత్యముపట్ల ప్రత్యేక ఆసక్తితో కృషిచేయుచున్న యీ ఏటి స్వర్ణకంకణ గృహీత ఉత్తమ రచనలను సాగించి బాలల సాహిత్యపెంపుకు తోడ్పడగలదని ఆశిస్తున్నాము.

మీ ఎప్పటి ఆదరాభిమానములతో పూజ్యబాబు కేసరిగారి ఆదర్శలక్ష్యాల సిద్ధికి కృషిచేస్తూ గృహలక్ష్మి పత్రిక కలకాలం వర్ధిల్లగలదని కూడ ఆశిస్తున్నాము.

---



మన నారీలోకం — 8

# ఆడపుట్టుక నికృష్టమా?

బ్రహ్మశ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావు

  

ఈ శీర్షికలో యింతవరకు మనము స్త్రీ పురుష స్వభావ వివరణా, వేదవాఙ్మయమునందలి స్త్రీలు, అన్యమతముల ప్రభావము, సమత్వాదర్శస్వరూపము, అర్థనారీశ్వరము, అను విషయములగూర్చి కొంతవరకు ప్రస్తావించి యుంటిమి. కాని యివన్నియు తత్త్వవిషయములు. ఇట్టి తత్త్వసూత్రములు నేటి మన నారీలోకములో యెంతవరకు ఆచరణలో నున్నవో, స్త్రీయభ్యుదయమునకును, లోకక్షేమమునకును, యిప్పుడెట్టి సంస్కరణలు జరుగవలసియున్నవో? అను అంశముపై యిప్పుడు మనము పరిశీలించవలసి యున్నది.

ప్రస్తుత మన నారీలోకముయొక్క స్థితి చాల దుస్థితిగనున్నదని లోగడ వ్యాసములలో జదివితిమి. ఇందులకొక్కటే నిదర్శనము. అసలు బిడ్డ పుట్టుటతోనే "మగబిడ్డా? ఆడపిల్లా?" అని యడుగుదురు, ఆడపిల్ల యగుచో, "అయ్యో! పాపము!" అని నిట్టూర్చుట సామాన్యానుభవము. కన్న తలిదండ్రులకును ఆడపిల్లలు కడుపు భారమై పోవుచున్నారు. విద్యార్థులలో మగపిల్లవాడైతే "ఫస్టు క్లాస్," ఆడపిల్లయైనచో "సెకండ్ క్లాస్" అన్న సర్టిఫికేట్లును సామాన్యమైపోయినవి. దీనికి కారణముల గూర్చి మనము దీర్ఘముగ ఆలోచించి, యీ భేదబుద్ధికిని, భావమునకును తగుచికిత్స యొనర్పమిచో, అచిరకాలముననే మన నారీలోకమొక వెనుకబడిన జాతిగ బరిణమించి, క్రమముగ నధోలోకమునకు పోగలదు. స్త్రీలు అట్టి అధోగతి నలంకరించినచో పురుషులు ఉత్తమస్థితికి పోగలుగుదురనుకొనుట కేవలము మిథ్యావాదము.

ఈ సందర్భములో ఒక్కవిషయమును మనము విస్పష్టముగ గుర్తించుట యవసరము. ఒక సంఘములో నూర్గురు సభ్యులున్నారనుకొన్నచో, అందు ఏభై మంది మాత్రము తగు కృషి యొనర్చుచు, మిగిలిన ఏభైమందియు నిర్వ్యాపారులైనచో, ఆ సంఘమెట్టి స్థితిలో నుండునో ఊహించుట కష్టసాధ్యము కానేరదు. దీనినిబట్టి మన సంఘములో పురుషులందరు శ్రామికులు, స్త్రీలు సోమరిపోతులని నా భావము కాదు. పురుషులలోను ఎంతయో నిర్వ్యాపారతయున్నది. స్త్రీలలోను క్షణం తీరికలేకుండా కష్టపడువారెందరో గలరు. కాని ప్రధాన విషయములలో— ఉదా: విద్యావిషయమై, ధనార్జన విషయమై, స్త్రీలు సహజముగ అర్హులై చేయదగిన ముఖ్యపనులవిషయమై, పరిశ్రమలలో, ఉద్యోగములలో, ఇప్పుడు మన నారీలోకమెంత వెనుకబడి యున్నదో, యీ మున్నగు అంశములను శ్రద్ధగ బరిశీలించినవారు తేలికగ గ్రహింపగలరు. ఇచ్చటి పురుషులందరును రేయింబవళ్ళు విశేషముగ కష్టించి పనిచేసినను యీ లోపమెన్నటికిని భర్తీకానేరదు— స్త్రీలలో అందరును నిర్వ్యాపారులుగ నున్నారని నేననను. ముఖ్యముగ కార్మికలోకములో స్త్రీపురుషులిరువురును కష్టించి పనిచేయుచునే యున్నారు. ఇక మధ్యకుటుంబములవారిలోను, ఉన్నత కుటుంబముల వారిలోనే యీ రుగ్మత ఎక్కువగ నున్నది. ఈ జాడ్యనివారణకు వారివారి యర్హతలనుబట్టి స్త్రీలకందరకు విద్యాసౌకర్యములు, వ్యాపారసౌకర్యములు కలుగజేయుటొక్కటే మార్గము. ఇట్టి మహత్తరకృషి రష్యా, చైనా మున్నగు విప్లవరాజ్యాలందే కాక, ఇంగ్లాండు, అమెరికా మున్నగు "మందకొడి" రాజ్యాలలోగూడ కొంతవరకు కొనసాగుచునే యున్నది. అందుచేత మనదేశమందును యీ స్త్రీ బానిసత్వము నంతమొందించుట అత్యవసర కర్తవ్యము. ఇది ఒక్క నారీలోకమునకు మాత్రమే కాకుండా, పురుషులకును, దేశమంతకును యెక్కుడు క్షేమకారి కాగలదనుట నిస్సంశయము. ఈ యత్నములలో మనము కేవలము విదేశీయుల ననుకరింప నవసరము లేదు, మన శాస్త్రములు మనకు ఉన్నవి. మన సంప్రదాయములును మనకు గలవు. ఈ మున్నగు విషయాలన్నియు గుర్తించియే మనము వ్యవహరించవలసి యుండును. కాని యిచ్చటనొక సాంఘిక విప్లవమవసరమనుట మాత్రము నిస్సంశయము.

ఇక పుట్టుకతోనే ఆడుపిల్లలపైగల విముఖభావము గురించి. ఈ భావము యిచ్చటగల స్త్రీ పురుష సంఖ్యాభేదమువల్ల కలుగుచున్నట్లగుపడదు. గత జనాభా అంకెలనుబట్టి ది 1-3-61 తేదీకి పూర్తియైన భారత జనాభా లెఖలలో 22 కోట్ల 50 లక్షలు పురుషులు, 21 కోటి 15 లక్షలు స్త్రీలు అని తేలినది. ఆంధ్రప్రదేశ్ లెఖలలోకూడ యిట్టి తార తమ్యమే అగపడుచున్నది. దీనినిబట్టి "మగబిడ్డలు వద్దుమొర్రో!" యని సంఘము విచారించవలెనేమో కాని, "ఆడపిల్లలు వద్దు!" అని అఘోరించవలసిన అగత్యమెద్దియు అగుపడదు. కావున ఆడపిల్లలయెడ విముఖభావము యిచ్చటి సహజ పరిస్థితులవల్ల ఉద్భవించినదని చెప్పజాలము.

ప్రస్తుత భారతసంఘములో—అందు ఆంధ్రులలో ముఖ్యముగ మధ్యమ కుటుంబీకులలో ఆడపిల్లల వివాహములు, అందుకవసరమగు కట్నములబాధ, యీ భావమునకు కొంతవరకు కారణభూతులగుచున్న వని చెప్పవచ్చును. ఈ కారణములు మానవప్రకృతికి సహజములు కావు. సాంఘిచారములలో చాల వరకు కృత్రిమము లేయని చెప్పవచ్చును. ఈ హేతువులను సంఘమును, ప్రభుత్వమును, ఏకమ్మడిగ యెదుర్కొనగలిగినచో యివి చాలవరకు నివారింప సాధ్యమగునని తోచును. ఇందుకే సంఘసంస్కర్తలును, ప్రభుత్వశాసన సభలును కొంతవరకు యత్నించుచునే యున్నారు. కాని యిట్టి మార్పులను జేయుటలో ప్రభుత్వ బాధ్యత కంటె సంఘములకే హెచ్చు బాధ్యత, అవకాశము లున్నవి. "రెండువేలకుమించి వరకట్నముల నొసంగ రాదని" ఆంధ్ర శాసనసభ శాసించినది. కాని ఆచరణలో యిది "తాటాకులలోన వ్రాసిరి" అనుటకు యెంతవరకు భిన్నముగ నున్నదో మన మెరుగుదుము. ఆడపిల్లల పెండ్లిండ్ల విషయమై పేద తలిదండ్రుల భార మెంతవరకు తగ్గినది? గుణవతులు, విద్యావతులు, రూపవతులగు బాలికలెంతమంది తగు వ్రయమునొసంగలేక అవివాహితులుగనుండిపోవుచున్నారు. ఎంతమంది ఏ ధనికవృద్ధులకో, కురూపులకో, షండలకో అమ్ముడుబోవుటలేదు? తమ దౌర్భాగ్య స్థితికి వాపోవుచు, తలిదండ్రుల నిస్సహాయతకు కృశించి యే కొలదిమంది యైనను ఆత్మహత్యయొనర్చుకొనుట లేదా? ఈ వివాహముల విషయమై, కట్నముల విషయమై, "చదువుకొన్న వారికంటె చాకలియే మేల"నునటుల, మన విద్యావిహీనులలోకంటె చదువుకొన్నవారిలోనే అవినీతి మరింత హెచ్చుగ నున్నది. బి. యే., ఎమ్. యే. లు ప్యాసైననాసైనను సరే. తగు కట్నము లభించనిచో పిల్లనచ్చలేదనియో, జాతకములు నప్పలేదనియో సాకులుచెప్పి, తమకు నచ్చిన పిల్లలనుగూడ నిరాకరించుచున్నారు. వెనుక బ్రహ్మసమాజపు రోజులలో మన విద్యాధికులలో కొంత నైతిక సంచలనము బయలుదేరెను, కాని దరిమిలా యిచ్చట వచ్చిన రాజకీయ, ఆర్థిక విప్లవములలో యీ సాంఘికనీతి చాలవరకు మరుగుపడిపోయినది. కావున యీ విషయమై తిరిగి యిచ్చట

ఇతరులను గురించి వాగేవాడు బాతాఖానీరాయుడు, తనను గురించి చెప్పుకునేవాడు అసంబద్ధప్రలాపి, మీ గురించీ మీ తెలివి తేటలను గురించీ మాట్లాడేవాడు సంభాషణాచతురుడు.

—"వెండెల్ హోమ్స్"

♦ ♦ ♦

అడగని వానికి ఒక పౌను ఇవ్వడం కంటే అడిగిన వానికి ఒక పౌన్సు ఇవ్వడం మంచిది. లోపల ఆకలి లేనపుడు ఆహారం ముందుంచి లాభంఏమిటి?

—"ఆస్కార్ వైల్డ్"

♦ ♦ ♦

ధర్మస్వభావం గలవాడే నిజమైన ధనికుడు. —"థామస్ బ్రవున్"

♦ ♦ ♦

లోన లేనిది బయిటికి పంపలేము.

—"యంథోవిటాలపి"

♦ ♦ ♦

ప్రపంచంలో ఉదాత్తగుణ సంపన్నులు బీదవారిలో కనుపిస్తారు. పరుల కష్టాలు తమ భుజంమీద వేసుకోడం వారికే బాగా తెలుసు.

—"జాన్ రాక్ ఫెల్లర్"

సేకరణ : వేముల కుటుంబరావు

ఒక నైతికాగ్నిని ప్రజ్వలింప జేయుటయే ముఖ్య కర్తవ్యమని తోచును. కాని పిల్లికి గంటకట్టువారెవరు? మన ప్రస్తుత సంఘమెంకరి చెప్పుచేతులలో నున్నదా? మన మతాధిపతులకును యిప్పటి ప్రజానీకమునకును యెట్టిసంబంధమున్నది? దీనిని వృద్ధిపరచుటకు గల సావకాశములెట్టివి? అది సాధ్యముకానిచో, వేరు గత్యంతరమేమి? యీ మున్నగు ప్రశ్నలన్నియు యీ సందర్భమున ఉదయించుచున్నవి. కాని మన ప్రస్తుత నారీ సమస్యలకవి కొంతవరకు అప్రస్తుతములగుటచే వానిగూర్చి యిచ్చట సమాధానములు వ్రాయబూనను.

పుట్టుకతోనే, "అయ్యో! ఆడపిల్లా?" అనుకొనుట కింకొక ముఖ్యహేతు వగుపడుచున్నది. మగబిడ్డడైనచో, విద్యావంతుడో, లేక శ్రామికుడో అయి కుటుంబ జీవసాధారమునకు కొంతవరకు ఆతడును సహాయభూతుడు కాగలడను ఆశ ముఖ్యముగ తలిదండ్రులలో కలుగుట సహజము. ఈ కారణమును చాలవరకు కృత్రిమమేయని మనము తేలికగ గ్రహించగలము. ఏలయన, స్త్రీ సహజముగ విద్యాస్వరూపిణి, ఐశ్వర్యదాయిని, సరస్వతీ, లక్ష్ముల ఏకైకమూర్తి యని లోగడ మనము చదివియుంటిమి. అట్టి వారికి విద్యాసౌకర్యములు, వృత్తిసావకాశముల నొసంగినచో యిప్పటి స్త్రీ పురుష భిన్నభావము చాలవరకు నశించగలదనుట తథ్యము. యావత్ప్రపంచమునందును, యిటీవల మనదేశములోకూడ కొంతవరకు యిందువిషయమై జరుగుచున్న మార్పులను మనము ప్రత్యక్షముగ జూచుచున్నాము. ముఖ్యముగ విద్యావిషయమై యిప్పుడనేకచోట్ల బాలురకంటె బాలికలే హెచ్చుశ్రద్ధగ జదువుచు, ఉన్నతశ్రేణులలో నుత్తీర్ణలగుచున్నారు. అచిరకాలముననే ఉద్యోగములలోను, కర్షక, వాణిజ్యములందును వీరు తప్పక ఉత్కృష్టస్థితి నందుకొందురనుట నిస్సంశయము. ఇందుకై సంఘమును, ప్రభుత్వమును, యెట్టి అడ్డంకులను కల్పించరాదు. వలయు సౌకర్యములను కలుగజేయుటయు అవసరమే. ఈ రీతిగ పురుషునితోపాటు స్త్రీయు జీవసాధారమునకొక కామధేనువే అను భావము ప్రబలును. అప్పుడే ఆడపిల్లలపైగల రోతయు అంతరింపగలదు.

సంఘములో ఆస్తికి పురుషుడే హక్కుదారు— స్త్రీకి యెట్టి ఆస్తి హక్కుగాని, వారసత్వపు హక్కులుగాని ఉండకూడదను భావము కొంతవరకు యీ అసమాన భావమునకు కారణమగుచున్నది. ఈ స్థితిని తొలగించుటకు కొన్ని యత్నములు జరుగుచున్నవి. పురుషులతోపాటు స్త్రీలకును ఆస్తి హక్కులొసంగబడుచున్నవి. వారసత్వపు హక్కులును కొంతవరకు సంక్రమించుచున్నవి. కాని ఈ యత్నములింకను తృప్తికరముగ లేవు. ఇందుకై మన శాసనసభలలోను, ప్రభుత్వకార్యాలయములందును స్త్రీలకు తగు ప్రాతినిధ్యము లేమిచే పురుషలోకము యీ విషయమై యింకను లోగడ బ్రిటిష్ ప్రభుత్వమునకువలె "క్రమేపి, వివిధ రంగములలో" (Through gradual and successive stages) మార్పులను జేయుటకు మాత్రమే అంగీకరించుచున్నది. ఇందుకు గత్యంతరము—లోగడ రాజకీయములందువలె సాంఘిక విషయములందును యిప్పుడొక విప్లవమార్గమే యవసరమని తోచును.

తుదిమాట—, యీ పుట్టుకతోనే ఆడపిల్లలయెడ గల న్యూనభావమును తొలగించుటకు ముఖ్యముగ మన యాడవారిలో ప్రప్రథమముగ ఆత్మాభిమానము కలుగవలయును. లోగడ అందరు బానిసలవలెనే వీరును "మాది ఆడపుట్టుక – వంటపొయ్యి దగ్గర మ్రగ్గుటయే మా జన్మహక్కు - మగవారి కాళ్లు పిసుకుటయే మా మానవ ధర్మము - మాకెట్టి చదువులు, ఆస్తిహక్కులు, వృత్తులు యెందుకు?" అను ఉదాసీనభావము పోవలెను. తమ సహజ శౌశీల్యతను విడువకయే పురుషులపై ఎట్టి తిరుగుబాటులతో నిమిత్తము లేకయే, తమ స్వాభిమానగౌరవమును తాము పొందుటకై వీరు తీవ్రముగ యత్నించవలెను. "నభవతి పురుషో నా నపుంసం నచ స్త్రీః" అను సూత్రమే మనకు ప్రమాణమగుచో, జన్మవల్ల స్త్రీలు నికృష్టులను భావము పోవలెను. మన నారీలోకోద్ధరణకిట్టి మార్పు అత్యవసరము. ఎన్ని చెప్పినను గీతలలో శ్రీ కృష్ణభగవానులు నుడివినటుల—

ఆత్మనోహ్య ఆత్మనో బంధుః
ఆత్మనోహ్య రిపురాత్మనః॥

అను సూత్రమే యెల్లగను, ఎప్పుడును శరణ్యము.

———(౦)———

# శ్రీకృష్ణకర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ప్రథమాశ్వాసము

కవిభూషణ శ్రీ కల్లూరి అహోబలరావు



౧

శ్రీకృష్ణ! పరమాత్మ! చిన్మయానంద! గో
  పాలకా! మురహారీ! పావనుండ!
గోవర్ధనోద్ధార! గోపికాలోల! అ
  క్రూరవరద! శ్రీముకుంద! అభవ!
కంసారి! గోవింద! కలుషవినాశ! పాం
  డవ పక్షపాతి! క్రీడావినోద!
ధర్మరక్షణకు, 'గీతావాణి' విన్పించి
  దుష్టుల శిక్షింప, శిష్టరక్ష
ణంబు సల్ప, నర్జునుని - యుద్ధంబు సేయఁ
బ్రోత్సహించిన, మహనీయమూర్తివీవు!
కృష్ణ! కర్ణామృతముగాఁగ - కృతిని వ్రాసి
పాడి విన్పింతు; నాదరింపవె? మహాత్మ!

౨

శ్రీ యప్సరఃస్త్రీల - చేతిపూవులతోడ
  నిండార మునిగిన నీటుకాఁడు
స్తుతవేణునాద, విశ్రుతలహరీ - సుఖం
  బులఁ జొక్కి సోలెడు - కులుకులాఁడు
స్రస్తమైపోవు, చేలములఁ బట్టుచు, గోపి
  కలు, జుట్టుముట్టిన - చెలువుకాడు
మ్రొక్కెడివారికి - మోక్షంబు నఱచేతఁ
  బట్టియిచ్చెడునట్టి - బాలకుండు
ఎల్ల దేవతాళి - యుల్లంబుఁగొన్నట్టి
బాలరూపమైన బ్రహ్మయోగి
నాదురచనలందు - మోదంబులొసఁగుచు
నాట్యమాడుగా - ననారతంబు.

౩

నేర్పుకు నెలవులై - నిత్యచంచలములై
  కాంతులీనెడు, గడగండ్లవాఁడు
లావణ్యరసవాహినీ, వీచికలఁ దేలు
  చున్నట్టి కన్నుల వన్నెకాఁడు
యమునానదీ, సైకతములఁ బ్రేమించెడి
  లచ్చి, మెచ్చులఁగొన్న - లలితయశుఁడు
మన్మథజనకుఁడై - మధురిమ స్వారాజ్య
  నిధియై, చెలంగెడి - నీటుకాఁడు
నల్ల గోపాలబాలుండు - నాదు వాంఛఁ
దీర్చుఁ గావుతఁ గవితలఁ దీర్చిదిద్ది:
బాలగోపాలబాలు, సంబరముతోడ
సతము బూజింతు, సేవింతు, సంస్మరింతు.

౪

నెమలిపురిని దాల్చి - నీపైన మోముతో
  నవయౌవనము గుల్క నాట్యకాఁడు
క్రొవ్విన కుచముల - గొల్లభామలచేత
  నారాధితుండైన యనఘమూర్తి
కుంతలభరముచేఁ గొమరు బ్రాయముచేత
  జగదేకవంద్యుఁడౌ - సరసమూర్తి
వేణునాదామృత - వీచికల్ విరజిమ్మి
  ప్రకృతిఁ జొక్కించెడు - పావనుండు
ఈడులేని, యానందంబు - నిచ్చునట్టి
జ్యోతిరూపుండు, కృష్ణుండు-శుభ్రమూర్తి
నా మనఃకంజమందు, ననారతంబు
నిలుచుఁగావుత - నాదు యంజలులఁ

గొనుచు

౫

మధురమౌ చిఱునవ్వు-మొలయాడుచున్నట్టి
ముద్దులు జిలుకు - నెమ్మొగమువాఁడు
పింఛభూషణముచే - వెలయుకుంతలముల
సింగారమును గల్గు - రంగుకాఁడు
వెడదకన్నులతోడ-వేడ్కఁ గొల్పెడివాఁడు
మదనమోహనుఁడైన - మన్మథుండు
శబ్దాది విషయ, విషామిషంబుల గోరు
చున్న, నా మనమున యున్నవాఁడు

దివ్యతేజంబు గన్నులు దెఱచినంతఁ
గానఁబడుచుండు నాకు-నిక్కంబు ; పెద్ద
కాలమౌ జ్యోతిఁగాంచితి ; కరుణతోడ
నన్ను రక్షింప శ్రీకృష్ణు - సన్నుతింతు.

౬-౭

కమనీయమైన - చక్కనిరూప సౌందర్య
సంపద గల్గిన సొంపుకాఁడు.
ముకుర సన్నిభమైన-ముద్దుచెక్కులవాడు
పూర్ణచంద్రునివంటి - ముఖమువాఁడు
వేణుగానామృత - వృష్టిని గురిపించు
కారుమబ్బుల దేహకాంతివాఁడు
అరమోడ్పు, తమ్మి సుందర నేత్రముల
వాఁడు

ముద్దులొల్కు, కిశోర-మోహనుండు
కమలముఖుఁడు, నా వాక్కు నాక్రమణఁ జేసి
తనదు సౌందర్యమహిమ, నుంతయిన నాదు
జిహ్వఁతోఁ బలికింపగాఁ జింతసేతు
బాలగోపాలు నేవేళ భక్తితోడ

౮-౯

నెమ్మిపింఛమె, మేటిసొమ్ముగాఁ గలవాఁడు
గోపకాంతలఁ బ్రేమఁ గొన్నవాఁడు
కలిగొట్టు యెఱ్ఱపూవులమించు, పాద - క
మలములు గల్గిన - కులుకులాడు
చివురు జేతులయందు - సింగారముగ, పిల్ల
గ్రోవిని ధరియించు - కోమలుండు
ముద్దుగాఁ బాడెడి - మురళీ విశారదుం
డా గోపికలఁ జేరి - హాయిగాగ

సుఖములంది, యుల్సటఁ జెంది సౌఖ్యవాఁడు
అధరకాంతి పుంజములచే, నలరు-ముద్దు
మోముగల్గినవాఁడు, సమ్మోహనుండు
గోపబాలుఁడతని నెప్డుఁ గూర్మిఁ దలఁతు.

౧౦-౧౧

వల్లవీ జనముల - వాలుచూపులచేత
నశ్రాంతమును, పూజలందువాఁడు
మదనరేఖలు, మాటిమాటికిఁ దోపించు
శ్వేతల కనులందు వెలయువాఁడు
కుచకుంభములయొక్క-కుంకుమ బురదతో
లలితమౌ, వక్షస్థలంబువాఁడు
చక్కని సొబగుల స్థావరమైయుండి
ఆనంద కనులచే - నలరువాడు
పడుచుప్రాయంపు శ్వేతల పాలివాఁడు
ఇట్టిదని చెప్పరాని, యూహింపరాని
దివ్యతేజంబు గలవాఁడు; తేజరిల్లి
నిలుచుఁగావుత ; నా మనోనిలయమందు

౧౨

సర్వలోకంబుల - సంపద కిరవైన
పాదపద్మంబులు ; ప్రణతులైన
భక్తుల కభయంబు - రక్తినొసంగెడు
పాదపద్మంబులు ; పద్మపాదల
యందంబుమీఱిన - సుందరమైనట్టి
పాదపద్మంబులు ; వల్లవీ, జ
నంబులనెల్ల, మోహంబునన్ ముంచెడి
పాదపద్మంబులు ; బరగనాదు
మనమునన్ దోచుచుండు సంబరముతోడ
సంతతంబట్టి శ్రీకృష్ణు చరణయుగము

ధ్యానమొనరించి ప్రార్థింతుఁ దమకమెసఁగ
నిత్యమైన బ్రహ్మానంద నిష్ఠఁ గొలుతు.

౧౩

కరుణామయములైన కన్నులు; ప్రాభవం
 బును దెల్పు కన్నులు; ప్రొద్దుఁబ్రొద్దు
నభినయములఁజూపు - యానందకరములౌ
 కన్నులు; సొబగుల కనులు; తేప
తేపకుఁ బెద్దవౌ - తెలిగన్నులు; కరుణా
 రసముజిల్కు కనులు - మిసిమికన్ను
లుండు, గోపాలబాలుండు; మా ప్రాణ నా
 థుండు; ముద్దుల కిశోరుండు; మాదు
హృదయపద్మమందు - మెదలుచు
 మా భక్తిఁ
గొనెడువాఁడు; కరుణఁ గూర్చువాఁడు;
మేలుగోరువాఁడు - మిత్రునికైవడి రక్ష
 సలుపు మమ్ము రక్తితోడ,

౧౪

చక్కదనంబుల కిక్కయై, శృంగార
 మదముచేఁ గన్నులు మబ్బుగ్రమ్మ
ముద్దులు గులికెడు - మోహనాకృతితోడ
 భాసిల్లుచుండు గోపాలబాల!
మందహాసముతోడ - మధురమౌ
 ముఖచంద్ర
 బింబంబుఁ గల్గిన వేడ్కకాడ!
శృంగారరసము, తరంగ భంగిమతోడఁ
 బొంగార, రంగారు పొలుపుకాడ!

నాదు మనమునందు - నాట్యమాడగరమ్ము
నటనఁగాంచి నీదు నయముగాంచి
నటనఁజేతు నేను - నందనందన! వేగ
రాగదయ్య! కోర్కె లీగదయ్య!

౧౫

అవ్యాజమౌ, మంజులాననాబ్జముయొక్క
 ముద్దుతనముచేత మురిపెమంది
పిల్లనగ్రోవి, సంఫుల్ల వినోద, నా
 దామృతము గుఱియఁ ద్రావిత్రావి
భక్తి రసమున సంయుక్తమై - నాదు చి
 త్తంబు, లోకముల కుదారముగను
మేలొనగూర్చెడి - బాలగోపాలుని
 చల్లని తేజంబు సంతతంబుఁ
ధ్యానమొనరించు; నా పరంధాముఁడల్ల
నల్ల ముద్దుపాదముల, నొయ్యారముగను
గంతులను వేసివచ్చి, నా మంతనమున
సతము క్రీడించు గావుత సంబరమున.

౧౬

రతనపు టందియల్ - ప్రాభవంబుగను
కిణకిణ శబ్దమంకింపగా కృష్ణ!
వ్రేపల్లె వీథుల - వేడ్కతో నీవు
పారాడుచున్నావు; పాదచిహ్నములు
వీథులలో నెల్ల - వెలయుచునుండు
భక్తి నా గుఱుతులఁబట్టి ప్రార్థింతు.

(సశేషము)



# నలిగిన హృదయాలు

శ్రీమతి పతానేని శ్రీశైలభ్రమరాంబ

గిరిజ కళ్ళంట నీళ్లు ధారగా కారిపోతున్నాయి. అణగిమణగి వున్న ప్రేమాగ్ని ప్రజ్వరిల్లింది. నిద్రించి వున్న తనలోని ప్రేమ మేల్కొంది. మొట్టమొదటి నుంచీ బావమీద తనకున్న ప్రేమ పొంగి పొరల నారంభించింది. ఆ ప్రేమ ప్రవాహమంతా కళ్ళ నుంచి కన్నీటిధారలై గట్లు త్రెంచుకు ప్రవహిస్తోంది. తన బ్రతుకంతా ఇంక గాఢాంధకారమేనా? బావ మనస్సు మారదా? తనబావ లోకాని కందరికీ డాక్టరై చికిత్స చేస్తున్నా, తన మనోగ్లాయానికి మందు ఇవ్వలేడా? బావలో గొప్పతనం హెచ్చిన కొద్దీ తనను అతడు ఎంతో దూరం చేస్తున్నాడని తన అంతరాత్మే హెచ్చరిస్తోంది. బావ తననీ, తన హృదయాన్ని ముక్కముక్కలుగా చేసి తను కన్నీటితో కుమిలిపోతోంటే; తన కన్నీటి 'కెరటాల్లోంచి ఈదుకు ముందుకుపోయి ఏమి ఆదర్శాలను సాధించుకోగలడు? తన ప్రేమకు ఫలితం కన్నీరేనా? ఎవరి మనసుల్లో ప్రేమకుసుమాలు వికశిస్తాయో అక్కడే శూన్యత కూడా నివసిస్తుందా? ఎక్కడైతే ప్రేమ వెన్నెలలు వెదజల్లుతూ వుంటుందో అక్కడే అంధకారంకూడా ఆవరించుకొంటూంటుందా? ఎక్కడైతే స్నేహగంగ ప్రవహిస్తుందో అక్కడే స్వార్థత్యాగతరంగాలు లేస్తాయా? అమృతమయమైన తన ప్రేమని హాలాహలంగా భావిస్తున్నాడా తన బావ? మాధుర్యంగా జీవయాత్ర సాగించాలనుకున్నా తమ జీవితాలకు, ఎందుకింత కాఠిన్యం వచ్చింది? తనబావ ఇంక తనకి దక్కడా? తన అదృష్టమంతా నశించి పోయినట్లేనా?

ప్రకృతికి ప్రతికూలంగా బావ ఎన్నాళ్ళు నడువ గలడు? బావకి తనపై సర్వాధికారాలూ ఉన్నాయ్. బావ మస్తిష్కంలో తను గుర్తుకురాకపోయినా తన హృదయంలో మాత్రం బావ స్థిరంగా నివాస మేర్పరచుకున్నాడు. బావకీ తనకీ చిన్ననాడే వివాహ బంధం, చిన్ననాడే వివాహమయింది. పసిపిల్లలుగా వున్నప్పుడే బావా తనూ దంపతులయ్యారు. బొమ్మల పెళ్ళిలా తమకు జరిగిన వివాహబంధం జీవితాంతం విడివడని బంధమై గమ్యస్థానాన్ని చేరుకుంటుందని తమవాళ్ళంతా ఆశించారు. సీతా, సావిత్రీ, అనసూయ, చంద్రమతివంటి భారతీయ వనితలవలె సమస్తసౌభాగ్యములను పొందుతూ ఆదర్శగృహిణిగా జీవించాలని తనూ ఆశించింది. ఎన్నో ఆశలతో, అనేక కోరికలతో ఉవ్విళ్ళూరుతూ జీవితాన్ని ముందుకు నెట్టుకు వస్తోంది. కాని తన మనస్సుకి శాంతిలేదు. తనువుకి సుఖంలేదు. హృదయానికి తృప్తిలేదు. ఇంతేనా తన బ్రతుకు? తన హృదయ విదారకమైన ఆక్రందన తన బావ ఇంక తెల్సుకోలేడా? తన జీవితమంతా నిరాశా నిస్పృహలతో అంతం కావల్సిందేనా? తన బావని చూచి అందరూ గౌరవిస్తున్నారని తన మనస్సులో ఎంతో గర్వించేది. బావ మెడిసెన్ ప్యాసైననాడు తన ఆనందం; ఆ నాడు తన హృదయం సంతోషతరంగాలతో ఉప్పొంగిపోతూంటే ఆ పరమానందాన్ని బయట పెట్టడానికి తనయిల్లు కూడా చాలక తన మిత్రులందరితోనూ చెప్పుకొని మురిసిపోతూంటే; అదంతా తన అదృష్టమేనని వృద్ధసువాసినులందరూ ఆశీస్సులిచ్చారు. కాని తనకట్టి యోగ్యత ఎంతో దూరమై పోతోంది. తనకి ఆతృత హెచ్చినకొలదీ తన ఆశలన్నీ గగనకుసుమాలుగా అయిపోతున్నాయి. తను యీ పంచవర్షాల్లోనూ కంటికి తడిపెట్టని రోజే లేదనవచ్చు. తన బావ ప్రసాద్ని తల్చుకోని క్షణమే లేదు. ఒక్కసారిగా తనకి వర్తమానంలో ఆలోచనలు గతంలోకి మళ్ళాయి. పాతస్మృతులు అన్నీ పదేపదే గుర్తుకు వస్తున్నాయి.

గిరిజ, ప్రసాద్ మేనత్త మేనమామ బిడ్డలు. గిరిజ తండ్రి కొండలరావు. ఎలిమెంటరీ స్కూలు మాష్టరుగా నలుగురు పిల్లలతో వృద్ధమాతతో చాలీచాలని జీతంతో జీవయాత్ర సాగిస్తున్నాడు. ప్రసాద్ తల్లిదండ్రులకి ఒక్కడే ఏకైక పుత్రుడు. ప్రసాద్ తండ్రి లాయర్ గా బాగా సంపాదిస్తున్నాడు. గిరిజ పంచవర్షాల ప్రాయంలో ఒకటవ క్లాసు చదువుతూ వుండగా మేనత్తగారి కుటుంబం వీరింటికి వచ్చారు.

అప్పటికి ప్రసాద్‌కి పదవ సంవత్సరం సెకండు ఫారం చదువుతున్నాడు. ఆ పసివాళ్ళ అన్యోన్యత చూచి కొండలరావు తల్లి సావిత్రమ్మ ఎంతో సంతోషంతో మురిసిపోయింది.

ప్రసాద్ తండ్రి కామేశ్వర్రావు పదేళ్ళ ప్రాక్టీసులోనే ఇంత ధనవంతుడై పేరుప్రఖ్యాతులు తెచ్చుకుంటే... ఇంక కొడుక్కి పెండ్లి వయస్సు వచ్చేసరికి ఇంకా ఎంత గొప్పవాడౌతాడో?... అంతటి వున్నత స్థితిలోవున్న అతడు తన ఏకైక పుత్రుడు ప్రసాద్‌కి గిరిజను చేసుకుంటాడా? క్రమంగా కొండలరావు స్థితి దిగజారి కుటుంబం వృద్ధవుతోంది. ఇంక ముమ్ముందు తన కొడుకూ, కూతురుకి అంతస్థుల్లో భేదాలువచ్చి బంధుత్వాలు కూడా విడిపోతాయేమోనని బాధపడింది సావిత్రమ్మ. చివరకు తన ఉద్దేశాన్ని కొడుకు అల్లుడు దగ్గరుండగా బయటపెట్టింది సావిత్రమ్మ.

"ఇంత చిన్నపిల్లకి పెళ్ళిచెయ్యడానికి అప్పుడే తొందరేముంది? పెద్దవాళ్ళయ్యాక వారి అభిప్రాయాలు ఎల్లా మార్తాయో!" అన్నాడు కామేశ్వర్రావు.

"నేను పెద్దదాన్నయ్యా! కొడుకుని కూతుర్ని సమంగా కళ్ళల్లో పెట్టుకు పెంచా. వాళ్ళ అన్నాచెల్లెళ్ళలో అభిమానం వుంచుకుని వియ్యంపొంది శాశ్వతంగా విడిపోకుండావుంటే ఈ ముసలిప్రాణం సంతోషిస్తుంది" అంది సావిత్రమ్మ.

తల్లి మాటకు ఎదురాడని కొండలరావు, అతని భార్య సంతోషంగా అంగీకరించారు. పద్మావతి కూడా తల్లి మాటనే స్థిరపర్చి అన్నతో వియ్యం పొందాలనీ, తన కొడుకు ప్రసాద్‌కి గిరిజ తగిన పిల్ల అనీ చెప్పడంతో కామేశ్వర్రావు కూడా అంగీకరించక తప్పిందికాదు.

వృద్ధమాత సావిత్రమ్మగారి కోరిక ప్రకారం అయిదేళ్ళ గిరిజకి పదేళ్ళ ప్రసాద్‌కి దిగ్విజయంగా వివాహమహోత్సవం జరిగిపోయింది.

♦ ♦ ♦

ప్రసాద్ మర్నాడు మద్రాస్ మెడిసన్ చదువుకి వెడ్తున్నాడని తెలిసి గిరిజ ఎంతో ఆనందించింది. తన బావను చూచి అప్పటికే రెండేళ్ళయింది. ఒక్కసారి ఎల్లాగైనా చూడాలన్న వాంఛను మనస్సులో ఆపుకోలేక తండ్రితో చెప్పి తమ్ముణ్ణి తీసుకుని అత్తవారింటికి వెళ్ళింది.

గుమ్మంలో బండి దిగిన గిరిజను చూచి పల్కరించి నట్లుగా "ఇదేనా గిరిజా రావడం? ఖులాసాయేనా? మీ యింట్లో అంతా సుఖంగా ఉన్నారా?" అన్నాడు ప్రసాద్.

"నువ్వు రేపే వెళ్ళిపోతావని విన్నాక ఇంక నిన్ను చూడకుండా వుండలేక వచ్చేశా. ఇవ్వాళ ఒక్కరోజైనా నీతో గడిపి రేపు వెళ్ళిపోతా" అంది గిరిజ.

"నీ చదువు బాగా సాగుతోందా?" చిరునవ్వుతో అడిగాడు.

"నీ దయవల్ల బాగానేవుంది" అంది ఆనందంగా.

"సరే! లోపలికి రా!" అంటూ ఆహ్వానించాడు ప్రసాద్. గిరిజ మేనత్త దగ్గర కూర్చున్నదన్నమాటేగాని ఆమె మనస్సంతా బావవైపుకే పరుగెడ్తోంది. తమకి చిన్నప్పుడే వివాహమైనా తనని భార్య అని చెప్పడానికి ప్రసాద్ ఒప్పుకోడు. అతనికి బాల్యవివాహాలంటే ఎందుకో యిష్టంలేదు. ఆ వుద్దేశంతోనే తన చదువు పూర్తయి ఉద్యోగంలో చేరేవరకూ తనని "బావా!" అనే పిలవమన్నాడు. అతనికి ఏది యిష్టమో తనకీ అదే సమ్మతము. తన ఎదుటనే తన బావ అతనికింకా పెళ్ళి కాలేదని చెబుతూంటే విన్నప్పుడు మాత్రం తన మనస్సు చివుక్కుమనేది. అయినా బావ మాటకి ఎదురాడలేక ఎల్లాచెప్పినా బావ తనవాడే! తన భర్తే!! తన సొత్తే!!! అని తృప్తిపడేది. బావ చదువు పూర్తయి వచ్చేవరకూ తనని కూడా చదువుకోమని చెప్పాడు. అంతేకాదు. తన చదువుకయ్యే ఖర్చుకూడా తండ్రిని పంపించమని, నిక్కచ్చిగా చెప్పాడు బావ.

ఆ రోజంతా గిరిజా, ప్రసాద్ లిద్దరూ తాము చదువుకోబోయేదాన్ని గురించి చెప్పుకున్నారు. బాగా శ్రద్ధగా చదివి ప్యాస్ అవుతుండాలని గిరిజను మరీమరీ హెచ్చరించాడు ప్రసాద్.

ప్రసాద్‌ను యం.బి.బి.యస్. చదువుకోసం మద్రాసు సాగనంపి మెయిల్ వెళ్ళేవరకు చూచి అత్తమామలతోబాటు ఇంటికి వచ్చింది గిరిజ. మళ్ళీ తన చదువుకోసం ఆరోజే వచ్చేసింది గిరిజ.

♦ ♦ ♦

ఎం. బి. బి. యస్. మొదటి తరగతిలో ప్యాసయ్యాడు ప్రసాద్. తన ఆదర్శాలకు, ఆశయాలకు తగినట్లుగా కార్యరంగంలోకి దూకి తన జీవితాన్ని సార్థకం చేసుకోవాలనుకున్నాడు. దేశాభ్యుదయం, ప్రజాశ్రేయస్సుకు డాక్టర్లు నిర్వహించవలసిన

బాధ్యత ఎంతైనావుందని కాలేజీ జీవితంలో ఎంతో ఘాటుగా ఉపన్యాసాలిచ్చేవాడు. మానవకోటి కందరికీ ప్రధాన సమస్యలైన జీవన్మరణాలు. రోగాలకు సంబంధించిన వృత్తి నవలంబించే ప్రతీ డాక్టరు తన బాధ్యతలను గుర్తించి, అత్యంత ఆసక్తితో శ్రద్ధ వహించి ప్రజలను చూస్తుండాలనీ, పదవులూ, అధికారం, ధనం, హోదాకోసం ప్రాకులాడకుండా నిస్వార్థమైన మానవసేవతే తమ ధర్మంగా భావించి అహోరాత్రాదులు కృషిచెయ్యాలనీ ఉద్బోధించేవాడు. అందులో సామాన్యజనులు, నిరుపేదలయందు ప్రత్యేకమైన ఆసక్తి, జాలి, దయ వెల్లడించేవాడు.

అతనిలోని ఉత్సాహానికీ, ఆశయాలకీ ప్రొఫెసర్లు, తోటి సహాధ్యాయులు ఎంతో మెచ్చుకునేవారు. కాలేజీ వదలి ఇంటికి వచ్చేటప్పుడు కూడా "ప్రసాద్! ఇదివరకంతా ఉపన్యాసాలు కాబట్టి ఎన్నైనా యిచ్చేవాడివి. అవన్నీ ఈ మద్రాసులోనే వదిలేస్తావో! ఆచరణలో పెడ్తావో! నిజంగా నువ్వు ఆచరించాలన్నా గాని మీ అమ్మా, నాన్నా నీ ముక్కుకు తాడోసి మూడుముళ్లూ వేయించి భార్యను అంటకడ్తారు. అంతటితో నీ ఆదర్శాలు, ఆశయాలు బంద్!" "అంతేనా?" అన్నారు మిత్రులు.

"ఈ ప్రసాద్ అన్నమాట తిరగడని మీకు త్వరలోనే తెలుస్తుందిగా! నా జీవితమంతా మానవసేవకోసమే వినియోగించి సార్థకపరుచుకోదల్చుకున్నా" అని ఖండితంగా చెప్పాడు ప్రసాద్.

తను భవిష్యత్‌లో చెయ్యబోయే మానవసేవను గురించి తన ఆదర్శాలు, ఆశయాలు ఎల్లా నెరవేర్చుకోవాలో, దేశాభ్యుదయం కోసం తన సర్వస్వం అంకితంచేసి రోగులకోసమే తన సర్వం త్యాగం చెయ్యాలని మనస్సులో నిశ్చయాభిప్రాయాన్ని దృఢపర్చుకొని పట్నంనుంచి ఇంట్లో అడుగుపెట్టాడు ప్రసాద్.

ప్రసాద్ గుమ్మంలోకి రాగానే తండ్రి, "నాయనా! నీ చదువు పూర్తయింది. నీ యిష్టప్రకారం గిరిజ కూడా బి.ఏ. పూర్తిచేసింది. ఇంక మీరిద్దరూ అన్యోన్యంగా కాపురం చేస్తోంటే మావి ఆనందించడమే మాకు కావల్సింది. నీ మాటే తీసుకుని శుభముహూర్తం పెట్టించాలనుకొంటున్నాం" అన్నాడు.

ఈ మాటలు విన్న ప్రసాద్ మిన్ను విరిగి మీద పడ్డట్టయింది. నిజానికి తనకి గిరిజ అంటే ఎంతో ఇష్టమే. ఆమె తనకి అర్ధాంగి. అగ్నిసాక్షిగా చిన్ననాడే స్వీకరించిన భార్యను తను ఆదరించవలసినవాడే. కాని... కాని... తనకి మద్రాసు చదువుతో మనస్సు మారింది. భార్యను ఇంటికి తెచ్చుకుంటే తనకి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు నశిస్తాయేమోనని భయం పట్టుకుంది. తన ఆదర్శాలు నెరవేర్చుకుందుకు తాను ఒంటరిగానే యుండాలని మనస్సాక్షిగా తీర్మానించుకున్నాడు. అందుచేతనే మొండిధైర్యం తెచ్చుకుని, "నాన్నా! ఇంత చదువూ చదివినందుకు అందరిలా భార్యకు విధేయుడనై నా స్వేచ్ఛను చంపుకు జీవించలేను. గిరిజను ఇంటికి తెచ్చుకుంటే ఇంక పిల్లలతో సహా సంసారంలో కూరుకుపోతే! ఆ తాపత్రయంలో పడినట్లయితే నా ఆశయాలు నెరవేర్చుకోలేను" అన్నాడు ప్రసాద్.

ఇల్లాంటి మాటలు ప్రసాద్ నోటంట వస్తాయని ఎన్నడూ ఊహించని కామేశ్వర్రావూ, పద్మావతీ కూడా ఒకరి ముఖాలొకరు చూచుకుని నిర్ఘాంతపోయారు.

"అదేమిట్రా ప్రసాద్? ఇప్పటికే నీకు ఇరవైనాల్గు ఏళ్లు దాటుతున్నాయి. గిరిజకి ఇరవై కూడా వస్తున్నాయి. ఇంకా ఎన్నాళ్ళురా మీరిద్దరూ బ్రహ్మచారుల్లా వుండడం?" అంది తల్లి కోపంగా.

"చూడు ప్రసాద్! నువ్వు బి.యస్.సి. చదువుకుంటానంటే సరేనన్నా - బి యస్.సి. పూర్తయ్యాక యం.యస్.సి. వెళ్ళమంటే; యం.బి.బి.యస్. చదివి డాక్టరు అవుతానన్నావు. అందుకు నేనేమీ అడ్డు చెప్పలేదు. నువ్వు ఏం చదువుకుంటానన్నా నేనేమీ అడ్డుచెప్పను. మా సర్వస్వం నువ్వే! నీ యిష్టమొచ్చినట్లు మా ధనాన్ని ఉపయోగించుకో. కాని ఒక మాటని మాత్రం కాదనకు. గిరిజ నీ భార్య నీ యిష్టప్రకారం ఆమె కూడా గ్రాడ్యుయేటు అయింది. బాగా చదువుకున్న ప్రాజ్ఞురాలు గిరిజ. ఆమెకు నువ్వంటే ప్రాణంతో సమానం. ఆమె మాత్రం నీ ఆశయాలకు అడ్డుపడ్తుందా? నీ యిష్టానికి గిరిజ ఏనాడూ వ్యతిరేకంగా నడుచుకోదని నీకు మాత్రం తెలీదా?" అని కొడుకును ఒప్పించాలని కామేశ్వర్రావు శతవిధాలా ప్రయత్నించాడు. కాని ప్రయోజనం శూన్యమైంది.

"క్షమించండి నాన్నగారూ! నేను ప్రస్తుతం గిరిజను తీసుకువచ్చేందుకు ఒప్పుకోలేను. ఆమెను కావాలంటే ఇంకా చదువుకోమని చెప్పండి" అని ఖండితంగా చెప్పాడు ప్రసాద్.

"సరే! నేను పెద్దవాణ్ణి కాబట్టి చెప్పవలసిందంగా చెప్పాను. ఆటుపైన మీ అదృష్టం!" అన్నాడు తండ్రి భారంగా.

"కట్టుకున్న యిల్లాలిని కాళ్ళతన్నడం ఇంత చదువుకున్న వాడవు నీకు న్యాయంగా వుందా? అంది తల్లి.

"పోనీ ఆమె కిష్టమైన ఉద్యోగం చేసుకోమను. బాగా కాలక్షేపం అవుతుంది" అన్నాడు ప్రసాద్.

పట్టినపట్టు వదలని కొడుకు స్వభావం ఎరిగిన తండ్రి ఎవరి కర్మకు ఎవరు కర్తలు? ఊరుకో!" అని భార్యను వారించాడు కామేశ్వరరావు.

కామేశ్వరరావు కొడుకు ఇష్టప్రకారం అప్పటికి బ్యాంకులోవున్న అరవై వేల రూపాయిలూ ప్రసాద్ పరంచేశాడు.

భర్త మాటకు ఎదురాడని పద్మావతమ్మ కోడలిని ఇంటికి తీసుకురావడం మాని, కొడుకు స్వంత డిస్పెన్సరీ తెరవడం ఇష్టం లేకపోయినా, బయటకు గట్టిగా ఏమీ అనలేక కొడుకు కోడలు తమ నట్టింట మసిలేటట్లు చెయ్యమని, వారిద్దరిలోనూ పొత్తు కల్గేటట్లు కొడుకు మనస్సు మార్చమని భగవంతుని ప్రార్థించేది.

ప్రసాద్ క్రొత్తగా డిస్పెన్సరీ ప్రారంభోత్సవం చేసినవాడైనా గిరిజను రమ్మని ఆహ్వానిస్తాడేమోనని ఎదురుచూచింది. కాని ప్రసాద్‌కి అసలు గిరిజను తల్చుకునేందుకు కూడా తీరిక లేనట్లుగా అయిపోయాడు. డిస్పెన్సరీ తెరచిననాడు ఎందరో గొప్ప గొప్ప డాక్టర్లు, ఉన్నతోద్యోగులు, మిత్రులు, బంధువులు అందరూ వచ్చి కామేశ్వరరావు కుటుంబాన్ని గురించి స్తోత్రపాఠాలు వల్లించారు. ప్రసాద్ ఆదర్శాలకీ, ఆశయాలకీ మెచ్చుకుంటూ అభినందించారు. ఉదారగుణసంపన్నుడగు ప్రసాద్ డిస్పెన్సరీ ప్రారంభోత్సవం వార్తాపత్రికల్లో కూడా ప్రకటించారు. ప్రసాద్‌ను గురించి పత్రికలో చదివి గిరిజ మనస్సులో ఎంతో ఉప్పొంగిపోయింది.

తన ప్రసాద్ తనకి ఆహ్వానం పంపుతాడని ఆశించింది గిరిజ. కాని కనీసం ఈ అయిదు సంవత్సరాల్లోనూ ఒక్క జాబుకూడా వ్రాయలేదు.

తను ఎంతో మక్కువతో ఎప్పుడైనా ఉత్తరం వ్రాస్తే జవాబుగా మూడే పంక్తుల కార్డు వచ్చేది.

ప్రియమైన గిరిజకు,

నేను క్షేమంగా వున్నాను. నువ్వు శ్రద్ధగా చదువుతున్నట్లు తలుస్తా. నీ ఆరోగ్యం జాగ్రత్త.

నీ బావ, ప్రసాద్

ఇంతకన్న అతని నుండి ఎప్పుడూ ఎక్కువ జాబు రాలేదు. అయినా అతనియందు తనెప్పుడూ కోపగించలేదు. బాగా చదువుకున్న బావ ఎంతో ఆలోచించే తనకీ చిన్నకార్డు వ్రాశాడనుకునేది. చివరకు తనకు ఆహ్వానం పంపించనందుకు కూడా ఆమె దురభిప్రాయపడలేదు. బావ పని తొందరలో మరిచిపోయాడేమో అనుకొంది. వార్తాపత్రికలో చదివిన గిరిజ ఆనాడు ఎంత సంతోషపడిందో ఆ దైవానికీ, ఆమెకీ మాత్రమే తెల్సు. ఒక్కసారి కళ్ళ కరవు తీరా బావను చూడాలనుకొంది. తనకుతానై వెడితే బావ ఏమనుకొంటాడో? అత్తమామలు ఏమంటారో? తల్లిదండ్రులు అనుమతిస్తారో; లేదో? ఇల్లాంటి సందేహాలతో ఊగులాడిపోతోంది గిరిజ. చివరకు ఓ జాబు కూడా వ్రాసింది ప్రసాద్‌కి. కాని దానికి జవాబుకూడా తనకి రాలేదు.

కామేశ్వరరావుగారు యథాప్రకారం గిరిజకి సొమ్ము పంపిస్తూ, యం. ఎ. లో చేరి చదువుకోమన్నారు. ఈసారి మళ్లీ చదువుకోమనేసరికి గిరిజ మనస్సులో అల్లల్లాడిపోయింది. తన బావ కోరిక కోసం తను బి.ఏ. ఫస్టు క్లాసులో ప్యాసైంది. ఇంకా తనకెందుకు చదువు? ఇన్నాళ్ళూ ప్రసాద్ పట్నంలో చదువుతున్నాడు. కాబట్టి తను దూరంగా వుండడం తప్పలేదు. ఇంకా తనకి ఎందుకీ అగ్నిపరీక్ష? తన బావ హాయిగా ఉన్న ఊరిలో కన్న తల్లితండ్రుల దగ్గరే స్వంత డిస్పెన్సరీ పెట్టుకుని ప్రయివేటు డాక్టరుగా ప్రఖ్యాతి పొందుతూంటే, ఇంకా తనకెందుకీ చదువు? విజ్ఞానానికి సరిపోయే విద్య తనకి చాలదా? తనింక నిగ్రహశక్తితో చదువుకోలేదు. బావ రాగానే చదువుకి స్వస్తిచెప్పి సంసారజీవితంలో ప్రవేశించాలనుకొంది. తన ప్రసాద్ ఆజ్ఞప్రకారం శారీరకంగానూ, మానసికంగానూ తను ఎంతో ఆరోగ్యవంతురాలిగా వుంది. తమ్ముళ్లతో చెల్లెళ్ళతో చిన్నపిల్లలా కల్సిపోయి ఎంతో సరదాగా వుంటుంది. ఎప్పుడూ ఉరకలు వేసే ఉత్సాహంతో నవ్వుతూ మాట్లాడుతుంది. మగవాళ్ళ విషయంలో మాత్రం అతిగంభీరంగా మసల్తూ, మితభాషియై మాట్లాడుతుంది. తనబావ ప్రసాద్‌ని తల్చుకుని మురిసి ముగ్ధురాలై ఏ ఆకాశంలోకో గాలిలో తేలిపోతూ విహరిస్తూంటుంది.

(సశేషము)

కల్పిక

# ఊహాగానం

'కమలలత'



సాయంత్రం ఏడు గంటలయింది. అప్పటిదాకా ఆఫీసులో ఎత్తిన తల దించకుండా పనిచేసి అప్పుడే బయలుదేరాడు యింటికి. ఎంత కష్టపడి పనిచేసినా జీతాలు తరగడంలేదు. రోజురోజుకు పెరుగుతున్నాయిగాని తగ్గే సూచనలే లేవు. ఒక్కొక్కపూట అసలు ఈ పనెందుకు చెయ్యాలి అని బాధపడతాడు. ఈ పని చెయ్యటానికే పుట్టానేమోనని ఆందోళన, భయం ఆవరిస్తుంటాయి. అదేసమయంలో, కాని తప్పదు. చెయ్యా నోరు కలవడానికదే మార్గం.

ఆశలు, ఆశయాలు ఎన్నో ఉన్నాయి. జీవితంలో అతనికి కథకుణ్ణవుదామని, 'యీ కథ చదివామండి' అని ఎవరయినా చెబుతుంటె ఆనందిద్దామని కోరిక. ఏళ్ళు గడిచిపోతున్నాయి గాని, కోరిక నెరవేరడం లేదు.

ఆఫీసునుంచి బయలుదేరాడన్న మాటేగాని యింటికి వెళ్ళడానికి భయం. యింట్లో కాలు పెట్టగానే వినిపించేవి పిల్లల ఏడుపులు. జీతం పెరగకపోయినా కుటుంబం పెరగడం మానలా మోహన్‌మూర్తికి. అదొక సమస్య. వీళ్ళందరిని ఎలా పెంచడం అని దిగులుపడి పోతుంటాడు వాళ్ళను చూసి.

తనభార్య తనని అర్థం చేసుకోదు. యింటికి రాగానే సణుగుడు మొదలుపెడుతుంది.

ఆ పూట యింట్లో బియ్యం లేవు. పొద్దుట ఆఫీసుకు వెళ్ళేటప్పుడే చెప్పింది బియ్యం పంపించమని. దొరకక కొంత, డబ్బులేక కొంత మోహన్ మూర్తి నిర్లక్ష్యం చేశాడు. పక్కింటమ్మను అప్పడిగి తీసుకుని కాలం వెళ్ళబుచ్చుతుందని తెలుసు. అయినా యింటికి వెళ్ళడానికి భయం వేసింది. మనస్కరించలేదు.

కనీసం ఒకగంట శాంతంగా గడుపుదామని పార్కుకు బయలుదేరాడు. దారిలో హైస్కూలు ఆవరణలో జనం కిటకిటలాడుతున్నారు.

ఏమిటడని ఒకాయన నడిగి తెలుసుకున్నాడు.

ఒక మహాకవికి సన్మానం. ఉత్సాహం కలిగింది. వెళ్ళి ఆ జనంలో ఒకమూల నిల్చున్నాడు.

మహాకవిని పుష్పమాలాంకృతుణ్ణి చేశారు. వేదికమీద పిల్లకవులు, పెద్దకవులు, ఒకరి వెంబడి ఒకరు సన్మానపత్రాలు చదివారు. కొందరు ఆయన చేసిన సాహిత్యసేవను కొనియాడారు. కావ్యాలను మహాకవికి అంకితం చేశారు. వినోదాలేర్పాటుచేశారు. దేదీప్యమానంగా వెలిగిపోతున్నాడు మహాకవి ఆ సమూహంలో

మోహన్ మూర్తికి ఆకలేసింది, యింటికి వెళ్ళడానికిష్టంలేదు. వేరేమార్గం లేదు.

యింటి ముఖం పట్టాడు. దారిలో

ఎదురుగా ఒక హోటలు లైటు కనపడింది. కాంతి విరజిమ్ముతోంది ఆ లైటు. దాన్ని చూస్తూ నడుస్తున్నాడు మోహన్‌మూర్తి.

దృష్టి కేంద్రీకరించడంవల్ల కళ్లు మిరుమిట్లు గొలిపాయి. ఆ జ్యోతి తప్ప అతనికింకేమీ కనుపించడంలేదు. అందులో మహాకవి సన్మానవేదిక చూశాడు. ఈసారి వేదికమీద మహాకవి బదులు తన ప్రతిబింబాన్ని చూశాడు.

ప్రజాసమూహం - కవిగోష్టి అన్ని ఉన్నాయి. మహాకవి సన్మానం కంటె ఎక్కువగా జరుపుతున్నారు.

తనభార్య పిల్లలతో వచ్చింది ఆ సమయంలో. ఒక వాలంటీరు, "తప్పుకోండి, కవిగారి భార్య" అని దారిచేసి ముందుకు తీసుకొస్తున్నాడు. ఆమె తనవైపు మీ ప్రతిభేనని ఒక్కచూపు చూసింది.

తన పిల్లలు ఎంతో ఆనందంగా ఉన్నారు. ప్రజలు తన పిల్లలను చూసి, ఎంత అదృష్టవంతులయ్యా మీరు ఆ మహాపురుషుడికి జన్మించారు" అన్నట్టు ఈర్ష్యతో చూస్తున్నారు.

తను మాత్రం తొణకకుండా బెణకకుండా నిండుకుండలా కూర్చొని ఉన్నాడు యిదంతా గమనిస్తూ.

యింతలో ఒంపులు వంటబట్టిన ఆవిడ కాలు ఘల్ మనిపించింది. తాళం, మృదంగం అందుకున్నాయి.

"ఎవడికోసం చేస్తారు యివన్ని" అన్న ధీమాతో కూర్చున్నాడు తను. నృత్యం జోరుగా సాగిపోతున్నది. ఆనందిస్తున్నాడు మోహన్‌మూర్తి ఆ హోటల్ లైటు చూస్తూనే!

లారీ హారన్ మ్రోగింది. మోహన్‌మూర్తికి వినబడలేదు. మళ్ళీ హారన్ మ్రోగింది. మోహన్‌మూర్తి దృష్టి మరలలేదు. పొం యి, పొంయి మని హారన్ మ్రోగించుకుంటూనే లారీ ముందుకొచ్చేసింది. మోహన్‌మూర్తిలో చలనంలేదు. నడుస్తూనే నృత్యానికి ఆనందిస్తున్నాడు చూపు మరల్చకుండా.

లారీకి బ్రేకుపడింది. ఆ శబ్దానికి మోహన్‌మూర్తి తన ఊహాప్రపంచంలోంచి వాస్తవానికొచ్చాడు. కాని ఆలస్యమైపోయింది. తప్పుకుందామని ప్రయత్నించేటప్పటికల్లా లారి మీదకొచ్చేసింది.

'అమ్మా!' అన్న కేకతో నేలకొరిగాడు. జనం మూగారు, హాస్పిటల్‌కు చేర్చారు.

తెల్లవారేటప్పటికల్లా మోహన్‌మూర్తి ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోయాడు.

# ఆల్బమ్

హిందీ :
"సుదర్శన్"

అనువాదం :
పన్నాల సుబ్రహ్మణ్యభట్టు



పండిత శాదీరామ్ పెద్దగా నిట్టూర్చి అనుకొన్నారు — 'ఈ ఋణం ఎప్పటికో తీరేది.'

ఆయన నిర్ధనుడే. అయినా మనసుకి మాత్రం కాదు. ఎలాగైనా సరే యజమాని, దాత – లాలా సదానంద బాకీ తీర్చేయాలనే అనుకొనేవాడు. ఆయనకి దమ్మిడీ మెహ్రీతో సమానము. పొట్ట కట్టుకొని నాలుగురాళ్ళు కూడబెట్టేసరికి, ఏదో అవసరం వచ్చి తన్నుకుపోయేది. మునిగిపోతుంటే కాళ్ళు చేతులు విరగగొట్టుకొని ఒడ్డు చేరిన మనిషికి ఒడ్డు జారిపోతే ఎలా వుంటుందో అలా వుంది ఆయనకి. అలాటప్పుడు పరిస్థితి ఎంత హృదయవిదారకంగాను, కరుణామయంగానూ వుంటుందో ? అతను కర్మని ఆడిపోసుకోడం తప్ప ఇంకేం చేయలేడు. అలాటి స్థితే శాదీరామ్‌ది.

వసంతాలు చాల గడిచాయి. శాదీరామ్ దమ్మిడీ దమ్మిడీ చేర్చి 80 రూపాయలు కూడబెట్టాడు. లాలా బాకీ వందరూపాయలు. అప్పు తీరేసమయం దగ్గర పడేటట్లు కనబడసాగింది. ఆశ మోసగిస్తూనే వుంది. హఠాత్తుగా ఆయన చంటికుర్రాడు జబ్బుపడ్డాడు. నాల్గు నెలల దాకా అనారోగ్యంగానే వున్నాడు. కానీ కానీగా కూడబెట్టింది మందులు స్వాహా చేసాయి. శాదీరామ్ పాపం నెత్తి మొత్తుకున్నాడు. ఇప్పుడు మళ్ళీ నలువైపులా చీకటే. సూదివాసి కాంతిపుంజమైనా కనబడేదికాదు. ఆయన పెద్దగా నిట్టూర్చి అనుకొన్నాడు - 'ఈ ఋణం ఎప్పటికో తీరేది.'

లాలా సదానందకి శాస్త్రిలుగారి అసహాయస్థితి పరిచయమే, శాదీరామ్ ఋణం తీర్చే ప్రయత్నం చేయడమూ ఆయన కిష్టంలేదు. ఆయనకి ఈ డబ్బు కొంత్తం వీసమెత్తుకూడా చేయదు. ఆయన దీనికి గొడవేం పెట్టాలేదూ కనీసం పల్లెత్తుమాటే అనాలేదు. అయితేనేం శాదీరామ్‌కి నిద్ర ఎక్కడిది ? సొమ్ముగురించి ఒక్కసారైనా అడగలేదు. ఎంత సహృదయుడో అనుకొనేవాడు. సరే అడగలేదు. దాని అర్థం నన్ను మాట్లాడక వూరుకొమ్మని కాదే.

ఆయనకి లాలా దగ్గిర మొహం ఎత్తడానికి కూడ ధైర్యంలేదు. ఋణభారం మెడలు వంచేసింది. లాలా సహృదయత చూపించకుండా మాటిమాటికీ అడిగి విసిగిస్తే శాదీరామ్‌కి మానసికంగా కష్టం కల్గక పోయేది. ఆకతాయిని మనం ఎదుర్కోగలం కాని, మెత్తనివాడి దగ్గర కన్నెత్తి చూడలేం.

ఒకరోజు లాలా ఏదో పనిమీద శాదీరామ్ ఇంటి కొచ్చి అల్మారులో వున్న బెంగాలీ, హింది, ఇంగ్లీషు మొదలయిన భాషల్లోని వందలాది మాస పత్రికల్ని చూసి, "ఇది ఏమిటీ ?" అన్నాడు.

శాదీరామ్ కాలిబొటనవ్రేలుతో భూమిని గ్రుచ్చుతూ జవాబుగా అన్నాడు పాత పత్రికలండి. అన్నయ్యగి చదవటం అంటే చాల ఇష్టం. తెప్పించే వారు బ్రతికున్నప్పుడు ఎవరినీ ముట్టనిచ్చేవాడు కాదు. ఇప్పుడు చెదకూడ పట్టాయి.

కాగితాలవాడికి అమ్మేయలేకపోయారు ?

బొమ్మలున్నాయండి. పిల్లలేడుస్తే బొమ్మ చింపి ఇస్తూవుంటూ ఏడుపు మానేస్తారు.

లాలా ఇంకా అన్నాడు. ఓ రెండు మూడు పత్రికలు చూపించండి. రంగుల్లో చాలా బొమ్మలున్నాయి. లాలా కొంతసేపటివరకు అలాగా - ఇలాగా చూస్తూనేవున్నారు. ఆయనకి ఏదో తట్టింది. అన్నాడు శాస్త్రిగారు.

"బాబూ"

"ఈ చిత్రాలు కళాపటిమనుచాటే వుత్తమమైన నమూనాలు. ఎవరికైనా నచ్చితే ఒకటి, రెండు వేలు సంపాదించవచ్చు."

శాస్త్రిలుగారు పెద్దగా నిట్టూర్చి అన్నాడు—

"ఆ అదృష్టం వుంటే ఇలా దుఃఖించక్కర్లేదు బాబూ !"

లాలా అన్నాడు — 'ఒక పని చెయ్యండి.'

'ఏమిటండి'.

ఇవాళ కూర్చుని ఈ పత్రికలలో వున్న మంచి చిత్రాలని చింపి వేరువేరుగా పెట్టండి.

"అలాగేనండి."

"ఇది అయ్యాక నాతో చెప్పండి."

"మీరేం చేస్తారూ ?"

"వీటన్నిటిని ఆల్బంగా తయారుచేసి మీ తరఫున ప్రకటన చేయిస్తాను. ఎవడైనా చదివితే మీరు నాల్గురాళ్ళు సంపాదించొచ్చు."

2

శాదీరామ్‌కి ఆశ యేమీ లేదు. బొగ్గులో వజ్రం దొరకదని ఘోర నిరాశ. ఆశ ద్వారాలన్నీ బంధించేసింది. ప్రపంచంలో అసఫలులై కేవలం అసఫలులవడానికే పుట్టిన మందభాగ్యులలో ఆయన ఒకడు.

బంగారాన్ని ముట్టుకున్నా మట్టి అయ్యేది. పట్టి అనుకోవడమే కాదు ఆయనకి గట్టినమ్మకమే – ఈ ప్రయత్నం ఎప్పుడూ ఫలించదని. కాని లాలా చెప్పడంవలన రోజల్లా చిత్రాలన్నీ చింపాడు. మనస్సులో చింపాలనీ లేదు, ఇష్టమూ లేదు. లాలా మాట కొట్టెయ్యలేకపోయాడు. ఒకదానికంటె ఒకటి మెరుగైన మంచి రెండువందల చిత్రాలు తయారయ్యాయి. వాటిని చూసి ఆయనికి ఆయనే విస్మయుడైయ్యాడు. ఆయన మొహంమీద ఆనందపు తరుణరేఖ నాట్యంచేసింది.

ఫెయిలయిన విద్యార్థికి తనకర్మమీద నిందమోపి విచారించాక ప్యాస్ అయినట్లు టెలిగ్రాం అందిన విధంగా – అలాటప్పుడు ఎంత ఆనందంగా వుంటాడో ? నలువైపులా ఎంతటి విస్మిత, ఆనందదాయక దృష్టితో చూస్తాడో ? ఇదే పరిస్థితి శాదీరామ్‌ని కూడ. ఆయన వాటికేసి ఎలా చూసేవాడంటే- ప్రతిచిత్రం నుంచి ప్రత్యేకంగా ఒక్కొక్క పది రూపాయలనోటు జారుతోందన్నట్టుల చూసేవాడు. పిల్లల్ని చిత్రాలవైపు చూడనివ్వనైనా లేదు. ఆశతో నెగ్గాడు కాబట్టి నిరాశ క్రోసులదూరం అప్పుడే మళ్ళిపోయినంతగా ప్రసన్నచిత్తంతో, అదే భావాలతో సతమతమయ్యాడు. లాలా ఉద్దేశం ఆయన మస్తిష్కంలో నిశ్చితంగా బైఠాయించింది.

లాలా చిత్రాలని ఆల్బంలో పెట్టించాడు. ప్రముఖ వార్తాపత్రికలలో విజ్ఞాపన ప్రకటించాడు. ఇప్పుడిక శాదీరామ్ ప్రతిక్షణం పోస్టుకోసం చూడడమే. ప్రతిరోజూ అనుకొనేవాడు ఇవాళ వుత్తరం వస్తుందని. ఆరోజూ అలాగే గడిచిపోయేది. వుత్తరం పత్రం ఏమీ వచ్చేది కాదు. రాత్రి ఆశ రోడ్డుమీద ధూళిలా మెదిలేది కాదు. కాని మరునాడు కార్లు, బళ్ళు వెళ్ళినతరువాత దుమ్ము లేచినట్లు లాలా మాటలతో తెగిన ఆశాతంత్రులు మళ్ళీ యథాస్థానానికి కట్టబడేవి. ఆశ మళ్ళీ దీప్తివంతమైన ముఖవర్ఛస్సుతో దర్శనమిచ్చి ఎదురుతెన్నులు కాయించేది. పోస్టు వచ్చే సమయమయితే బజారంతా నడిపించి పోస్టాఫీస్ చేర్పించేది. ఇలా ఒకమాసం గడిచింది. కాని ఏ వుత్తరం లేదు. శాదీరామ్‌కి నిరాశే; కాని అప్పుడప్పుడు ఆశ చీకటిలో మిణుగురుపురుగులాగ మెరిసేది. నిరాశా తప్తహృదయాలలో ఈ మిణుగురుపురుగు కాంతే ఎంత నవజీవనప్రదాయినిగా, హృద్యంగముగా వుంటుంది ? దీని సహాయంతోనే దారితప్పిన బాటసారి గమ్యం చేరుకుందామని ప్రయత్నిస్తూ కొంచెంసేపు తనబాధ మరచిపోతాడు. ఇదే సత్య దూరపుటాశలలో నిజమైన తేజస్సు లేనప్పటికీ ఎక్కడినుంచో వీనులకందే సంగీతంలాగ మధురంగా మనోహరణ చేస్తుంది తప్పక. వర్షానికుండే తేమ లేకపోయినా, వున్నా తిమిరజలదాల మాయని ఎవరు తప్పిస్తారు.

ఆఖరికి ఒకరోజున శాదీరామ్ అదృష్టం మేల్కొంది. కలకత్తానుండి సేఠ్ వుత్తరం వ్రాశాడు- "ఆల్బం పంపించండి, చూస్తాం. నచ్చితే కొంటాము. వెలగురించి కాదు,, సరుకు మంచిదవాలి" అని. నిదురపోతున్న మనిషిని లేపినపుడు అటూ ఇటూ కదిలి మళ్ళీ పరుపుమీదే పడుకుంటాడు. అలాటి మార్పే వుత్తరంవల్ల సంభవమయింది. ఇది మాత్రం కేవలం స్త్రీకి సంబంధించిన మార్పు, పురుషునికి సంబంధించిన మార్పుకాదు. శాదీరామ్ పరుగెత్తుకుంటూ లాలా దగ్గరకెళ్ళి వుత్తరం చూపించి అన్నాడు – పంపించనా !

లాలా ఉత్తరాన్ని బాగా పరిశీలించి అన్నాడు జవాబుగా "రిజిస్టరీ చేయించి పంపండి. సేఠ్ కొనుక్కుంటాడు."

"మరి ధర !"

వెయ్యికి తక్కువవుతే బేరంసాగదని వ్రాయండి.

కొన్నిరోజుల తర్వాత ఆయనకి ఇన్స్యూర్ చేసిన ఉత్తరం ఒకటి అందింది. శాదీరామ్‌కి కాళ్ళుచేతులు వణకసాగాయి; వాటికంటే ఆయన హృదయం ఇంకా అధికంగా గడగడ్లాడింది. తొందరగా కవరు చించి ఎగిరిపడ్డాడు. దాన్లో వందరూపాయల నోట్లు పది వున్నాయి. ముందర ఆయన అదృష్టం వక్రించింది. ఆయన ఇప్పుడు పూర్తిగా మేలుకొన్నాడు. శాస్త్రిలుగారు ఇప్పటిదాకా నించునివున్నారు. ఇప్పుడు కూర్చుని ఆలోచించసాగారు – "రెండు



డా॥ కేసరిగారి కుమార్తె శ్రీమతి కె. శారదా దేవి వస్త్రములను పంచిపెడుతున్నప్పటి దృశ్యము.



రామనాథపురం రాజభవనం



రామేశ్వర ఆలయ ప్రాంగణము

—By S. T. ARASU



తిరుచందూర్ నందలి సముద్రతీర దేవాలయం



మధురలోని గాంధీ మ్యూజియం

—By S. T. ARASU



తిరువనంతపురం మ్యూజియం

—By C. HARIHARAN



కన్యాకుమారిలో సూర్యాస్తమయ దృశ్యం

—By S. VARALAKSHMI AMMA

వేల రూపాయలు అడిగివుంటే బహుశా పంపివుండే వాడేమో! ఆలోచన ఆయన ఆనందానికి విఘ్నం కల్గచేసింది.

3

సాయంకాలం ఆయన లాలా సదానంద దగ్గిరకెళ్ళి ఐదువందల రూపాయల నోట్లు ఎదురుగా పెట్టి అన్నాడు - "పరమాత్ముని కృపవల్ల ఈ భారంనుండి నాకు విముక్తి కల్గింది. మీ సొమ్ము జాగ్రత్తపరచండి. మీరు చూపించిన సహృదయతకి దయనీ ఆమరణాంతం మరువను."

లాలా విస్మితవదనంతో అన్నాడు - "శాస్త్రిలు గారూ! శేర్, ఆల్బం కొన్నాడా?"

"చిత్తం సొమ్ముకూడా వచ్చేసింది."

"వెయ్యా?"

"చిత్తం. లేకపోతే ఈ నిర్ధన బ్రాహ్మణుడి దగ్గర ఏముంది మీ ఋణం తీర్చుకోడానికి. పరమాత్ముడు నా మొరాలకించాడు."

"నేను ముందరే చెబుదామనుకొన్నా. కాని వెనుకాడాను. మీరేమైనా అనుకొంటారేమోనని. ఇప్పుడు నాకేం బెంగలేదు. మీ చేతులో వున్నాయి రూపాయలు. నా వుద్దేశం ఈ డబ్బు మీ దగ్గర వుంచమని. నేను మీ దాతని. నా ధర్మం మీ సేవ చేయడం."

శాస్త్రిగారి కళ్ళలో నీరు తిరిగింది. తువ్వాలుతో తుడుచుకుంటూ అన్నారు - "మీలాటి సజ్జనులు ప్రపంచంలో చాల తక్కువమంది వుంటారు. పరమాత్మ మిమ్మల్ని చిరంజీవిగా చేయుగాక! నేనీ రూపాయలను తీసుకోలేను. ఇన్ని సంవత్సరాలు మీరు అడగనైనా లేదు. ఇదేం తక్కువ వుపకారం కాదు. నన్ను ఋణవిముక్తుణ్ణి గావించండి. ఈ ఐదు వందలు ఇచ్చి హృదయం శాంతిని కొననివ్వండి."

ధనహీన బ్రాహ్మణుని సత్‌శీలత చూసి లాలా హృదయంలో నెమలులు పురివిప్పి నాట్యంచేశాయి. ఆయన నోట్లు తీసుకొన్నాడు. రూపాయలు ధారపోసి ఆనందంగా వుండగలడన్నమాట. ప్రప్రథమంగా ఈ విషయం ఇప్పుడే లాలా అనుభవంలోకి వచ్చింది. శాస్త్రిలుగారు వెళ్ళిపోయాక ఆయన కళ్ళుమూసుకొని ఆలోచిస్తూ వుండిపోయాడు. ఇప్పుడు ఆయన ముఖమండలముమీద ఏదో ఆత్మిక తేజం వెల్లివిరుస్తూన్నది.

4

ఆరుమాసాలు గడిచాయి.

లాలాసదానందకి జబ్బుచేసింది. అంతటి జబ్బు వారు జన్మలోకూడ పడలేదట. శాదీరామ్ ఆయనకోసం రాత్రి - పగలు అనక ఎప్పుడూ 'మాల' త్రిప్పుతూనే వుంటాడు. ఆయన వైద్యుడు కాడు. ఆయన బ్రాహ్మణుడు. ఆయన మందు గాయత్రి జపించడమే; ఈ పని ఆయన తన శక్తికంటె హెచ్చుగా, అతిశ్రద్ధతోనూ చేస్తున్నాడు.

లాలా సదానంద ఒకరోజున మంచంమీద పడుకొని వున్నారు. ఆయన దగ్గిర ఆయన తల్లి కొడుకు దుర్బల తేజోవిహీనమయిన ముఖాన్ని చూస్తూ కన్నీరు లోలోపలనే ఇంకేటట్లు చేసుకుంటోంది. కొంచెం దూరంగా మూల ఆయన పత్ని ముసుగు తీసుకొని నించొని వుంది. ఇంక మిగిలిపోయింది అవకూడదు అనుకొని అలా చూస్తూనేవుంది. దగ్గరే పడి వున్న పీటమీద కూర్చొని పండిత శాదీరామ్ రోగికి భగవద్గీత వినిపిస్తున్నారు.

అకస్మాత్‌గా లాలా స్మృతి కోల్పోయారు.

శాస్త్రిగారు గీత వదిలేసి ఆయన తలాపదిక్కున కూర్చునివున్నారు. వేడిపాలు తీసుకురావడానికి లాలా భార్య వెళ్ళింది. తల్లి కొడుకుని పిలుస్తోంది భయపడి. శాస్త్రిగారు కూర్చొనివున్నచోట ఏదో పరుషంగావున్న వస్తువు వున్నట్లు అనుమానపడ్డారు. ఆయన అదేదో చూసేసరికి ఆశ్చర్యానికి అంతులేకపోయింది. ఆ వస్తువు ఆల్బం. దానిని సేఠ్ కాదు కొంట లాలాసదానంద్ కొన్నారు.

శాదీరామ్ చాలా ఆనందించారు ఋణాన్ని తీర్చేశాను కదా అని. ఋణం తీరలేదు. పైగా రెట్టింపు అయింది ఇప్పుడు అని తెలిసాక ఆయన హృదయానికి ఆఘాతం కల్గింది.

అయన తన స్మృతి కోల్పోయిన దాత దగ్గిర కూర్చొని పెద్దగా నిట్టూర్చి అనుకొన్నాడు. "ఇక ఈ ఋణం ఎప్పటికీ తీరదా?"

కొంతసేపటికి లాలాకి స్మృతి కల్గింది. శాస్త్రిగారి దగ్గిరనుండి ఆల్బం లాక్కొని నెమ్మదిగా అన్నారు - "ఈ ఆల్బం సేఠ్ దగ్గిరనుంచి నేను తెచ్చాను."

శాస్త్రిగారికి తెలుసు లాలా అబద్ధమాడుతున్నారని. కాని ఆయనకి ఇప్పుడు మునుపటికంటె లాలా సజ్జనుడు, ఉపకారి, ఉచ్ఛకోటిలోనివాడూ.

# రక్తపు మడుగు

కన్నడమూలం :
కుముదప్రియ'

అనువాదం :
'సీతాదేవి' (మంజరి)



"డెక్కన్ హెరాల్డ్! మాతృభూమి! హెరాల్డ్! ప్రజావాణి"

తెల్లవారఝామున పక్షుల కలకల ధ్వనులు మధ్య నీరసించిన కంఠం వినిపిస్తున్నది.

నారాయుడు వడివడిగా పోతున్నాడు. ప్రాతఃకాల మంత్రంలాగ "హెరాల్డ్! మాతృభూమి!" అంటూ కేకలేస్తూ పరుగెడుతున్నాడు.

మార్కెటు చౌకు దాటాడు. ఎడమ చేత్తో పట్టుకున్న పేపర్లసంచి నల్లగా ముతకకంపు కొడుతున్నది. అతని నడక హనుమంతుని జ్ఞప్తికి తెస్తున్నది.

వాడు ముందుకు పరుగెడుతుంటే ప్రక్కనున్న చెట్లు, యిండ్లు వెనక్కు పరుగెడుతున్నవి. అతడు మోటారుకారులాగ "ప్రజావాణి!...." అని ధ్వనిస్తూ పరుగెడుతున్నాడు.

"గంగులుకు పావలా యిచ్చాను... లేకపోతే వాడు బడి మానేస్తాడు. పక్కింటి నాగరాజు చెప్పాడు 'చూడు నారాయుడా! నీ తమ్ముడు జీతం డబ్బంతా సిగరెట్లకోసరం తగలేశాడు...ఎల్లుండి బళ్ళో పేరు కొట్టేస్తారు' అని."

"గంగులు...ఎంతమంచి .... సిగరెట్! హుం ఏమో...చిన్నతనం ... అమ్మ ... అమ్మకేమో యీవాళ దగ్గు ఎక్కువగా నున్నది. రాత్రంతా నిద్రలేదు. జోస్యులు మొన్న ఎనిమిదణాలు తీసికెళ్ళాడు ... ఎందుచేతనో మందు తెచ్చియివ్వలేదు."

"డెక్కన్ హెరాల్డు! ప్రజావాణి!"

వాణీవిలాస్ బాలికా పాఠశాలాభవనం దాటి వెళ్ళాడు.

"అమ్మ చెప్పింది ....తిరిగి వచ్చేటప్పుడు జోస్యులుగారి యింటికి వెళ్ళిరమ్మని... అన్నట్లు - ఆ షేవింగ్ సెలూన్ మనిషి నాలుగు రోజులు డబ్బివ్వలేదు. ఇవాళ మంగళవారం ... యింకెక్కడ? బియ్యం కొనుక్కెళ్ళాలి .... యిప్పుడు సద్య 25% కమీషను యిస్తారుగా!... ప్రజావాణికి మాత్రమేనట...పోనీ అదేచాలు...ఇంకొక యిడ్లీయైనా నిర్విచారంగా తినవచ్చు. చేబదులిమ్మంటే అతను ససేమిరా యన్నాడు...యిలాంటి మనుష్యులుండ బట్టే వానకు కరువైంది. నేనక్కడికి పారిపోతాను! యివాళ పది ప్రజావాణి పత్రికలిచ్చినా పబ్బం గడిచిపోయేది."

ఆ కుర్రవాడు శ్రీనివాస మందిరాని కెదురుగా ఒక నిముషం చేతులు జోడించి కండ్లు మూసుకొని నిలబడి మరల తన ఎప్పటి కార్యక్రమాని కుపక్రమించాడు.

పరుగెడుతూనే "డెక్కన్ హెరాల్డ్! మాతృభూమి" అంటున్నాడు — కేకలెడుతున్నాడు. మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

"ఆ మెడికల్ కాలేజి విద్యార్థి అసలు డబ్బేయివ్వలేదు. రెండువారాలకు పైగా అయింది. తనిస్తానన్నాడు అతని స్నేహి

తుడు...పోయినవారం నాలుగు ప్రజామత ప్రతులకు పూచీ యిచ్చాను. రిటర్న్ తీసికున్నా బాగుండేది.''

హైస్కూలు ముందు నిలుచున్న విద్యార్థి పిలిచాడు. నారాయుడు యీ లోకంలోకి వచ్చి ఒక ప్రజావాణియిచ్చి అణాపుచ్చుకున్నాడు. మరల— ''డెక్కన్ హెరాల్డు!.. ప్రజావాణి...!''

పక్షుల కలకలం ఆగిపోయింది. నారాయుడు మాత్రం పరుగెడుతున్నాడు. వరుసగానున్న చెట్లక్రిందుగా తూర్పుదిశనుండి అరుణ కిరణాలు ప్రసరిస్తున్నవి. కుర్రాడు మాత్రం పరుగెడుతూనే యున్నాడు.

మీనాక్షీ భవనం ... ఫర్వాలేదు ... వెళ్ళినప్పుడు కప్పు కాఫీ యిస్తాడు...పుణ్యాత్ముడు. అతని కొడుకు హరిశ్చంద్రుడు... అన్నట్లు పరీక్షలు కాగానే పెండ్లి చేసెయ్యాలి.

''నీవు పెద్దవాడవు. నీవు మొదట పెండ్లి చేసుకో — ఆ తర్వాత గంగులికి చేయవచ్చు'' నంటుంది అమ్మ. గంగులు సిగరెట్లు...చిన్నతనం.... బాగుపడతాడు. స్కాలర్ షిప్ దొరకలేదు... ఎవరెవరికో యిస్తున్నారు, దొరుకుతున్నవి. గోపి తమ్ముడు వేణుకేం తక్కువ? దేవుడిచ్చిన స్వంతయిల్లు ఉంది, కాస్తో కూస్తో ఆస్తి యుంది. వాడికి స్కాలర్ షిప్!.. పేదవాళ్ళకిది కాలం కాదు.... హుం.''

''డెక్కన్ హెరాల్! ప్రజావాణి...!''

నేషనల్ హైస్కూలు వెనుకనున్న హాస్టలులోకి వెళ్ళాడు. నలుగురు విద్యార్థులు పత్రికలు కొనుక్కొని డబ్బులిచ్చారు, మళ్ళాపరిగెత్తడం మొదలు పెట్టాడు.

''హెరా... ప్రజా...''

సూర్యుని చండకిరణాలు ప్రసరిస్తున్నవి. ఎనిమిది గంటలుగా పేపర్లు అమ్ముతూ నారాయుడు పరుగెత్తుతున్నాడు.

''ఇక గంగులు పనిలో ప్రవేశిస్తే నాకీ పరుగెత్తడం, కేకలెయ్యడం శ్రమ తప్పిపోతుంది. కొన్నిరోజులు నెమ్మదిగా కాలం గడుపవచ్చు. నాగమణికి మంచిసంబంధం వెతకాలి! ఎవరైనా పిల్లనిచ్చి పుచ్చుకుంటే నేను పెండ్లి చేసికొని ఆమెకీ చేస్తాను .. నాగరాజు చెప్పాను.. గంగులు ఆ కుముదమ్మకూతుర్ని...శారదను ప్రేమించాట్ట. అలాయితే అక్కణ్ణుంచి కానుపెగలదు... ప్రేమపెండ్లి... వరదక్షిణమాట అనకూడదు.... కానీయి—ఉన్నది ఒక్కగానొక్క తమ్ముడు, చెల్లెలు—ఎలాగైనా సరే...''

గాంధీబజార్ సర్కిల్

నారాయుడు కీచుగొంతుకతో ''డెక్కన్ హెరాల్డ్! మాతృభూమి! .. ''అరిచాడు.

గీతా రెస్టారెంటునుండి ఎడమ వైపుకు మళ్ళాడు.

''నాగమణికి, నాకు ఒక్క పందిట్లోనే పెండ్లయితే బాగుంటుంది. పిల్లనిచ్చిపుచ్చుకునేచోట . తరువాత.. ''

''బుర్...బాం...'' హారన్ చప్పుడు.

కారుక్రింద రక్తం చిమ్మింది. వార్తా పత్రికలన్నీ చెల్లాచెదరై రోడ్డుమీద రెపరెపలాడుతున్నవి. రక్తపు మడుగులో నారాయుడి శరీరం చలనరహితంగా పడి యున్నది. గుంపు కూడింది. పోలీసులు వచ్చారు. అన్నిపనులు ముగిసినవి.

కాని నారాయుడు యింటికి తిరుగు ముఖం పట్టలేదు.

# నృత్యసంగీతం

## రచన : ఎమ్మా యోంఛెవ్

నేను చెప్పబోతున్నది మీకు ఏమంత ఆసక్తిదాయకంగా వుండకపోవచ్చును. కాని యీనాటికీ "కార్యక్రమంలో తరవాత హంకం వాల్స్ కేప్రిస్" అని ప్రకటనకర్త ప్రకటించడం విన్నప్పుడు నా వొళ్ళు గడగడలాడుతుంది. ఆరోజు సాయంత్రం స్థానిక ఉద్యానవనంలో అకాసియా వృక్షశాఖల క్రింద లౌడ్ స్పీకర్ నుండి వాల్ట్జ్ సంగీతం వెలువడుతున్నది.

ఆ సంగీతం చాల మధురంగా ఆకర్షణీయంగా వుంది. నృత్యరంగస్థలం ఒక పెద్ద దర్పణంలా వుంది. దానిపై చంద్రుని ప్రతిబింబం కనిపిస్తూంది. తెల్లని దుస్తులు. సంతోషపూరితమైన నవ్వులు, ప్రేమపూరితమైన దృక్కులు దానిపై ప్రతిబింబిస్తున్నాయి. చెట్లకు వ్రేలగట్టబడిన విద్యుద్దీపాలు గాలికి వూగుతున్నాయి.

నర్తకీ నర్తకులను చూస్తూవుంటే నాకు ఈర్ష్య కలిగింది. అందమైన యువతులు యువకులతో కలిసి నృత్యం చేస్తున్నారు. నృత్యం చేయమని నన్నెవరూ అడగలేదు. కళ్ళజోడూ నేనూ ఆకర్షణీయంగా కనబడను, తగినసమయంలో అందంగా నవ్వులు కురిపించడం నాకు చాతకాదు. నేను పదిహేడేళ్ళ యువతిని, ఏదో ఎప్పుడూ ఆలోచిస్తూ వుంటాను. తొలిచూపుకు యిలాంటి యువతులు ఎవరినీ ఆకర్షించరు. ఇతరులకు వారు మందగొండిగా కనిపిస్తారు. కొత్తగా కొన్న నా తెల్లని జోళ్ళు కాళ్ళకు గట్టిగా పట్టి నొప్పి పెడుతున్నాయి. నాకూ ప్రేమించాలనే వుంది. నా మనసు అలాంటి అనుభూతిని కోరుతూంది. కాని అది నా కందుబాటులో లేదు.

ఒక బెంచీమీద ఒంటరిగా కూర్చున్నాను. నా మిత్రురాలు కెన్ని నృత్యం చేస్తున్నది, విశ్రాంతికైనా నా ప్రక్క కొచ్చి కూర్చోలేదు. నేనలాగే ఒంటరిగా, సంగీతం వింటూ కూర్చున్నాను. ఇతర యువతులకు వస్తున్న ఆహ్వానాలను స్వప్నంలో వింటున్నట్టు విన్నాను.

"నృత్యం చేస్తావా?"

"నాతో సంతోషంగా నృత్యానికి వస్తావా?"

"మనం నృత్యం చేద్దామా?"

కొందరు గట్టిగా అంటున్నారు, కొందరు మెల్లగా అంటున్నారు, కొందరు నిశ్శబ్దంగా చూపులతో, సౌంజ్ఞలతో ఆహ్వానిస్తున్నారు. కాని ఒక్క యువకుడైనా నా బెంచీ దగ్గరకు రాడేమి?

నా కెదురుగావున్న బెంచీవేపు చూశాను. నాలాగే దానిమీద ఒంటరిగా ఒక యువకుడు కూర్చుని వున్నాడు. అతని జుత్తు నల్లగా వుంది. నీలిరంగు సూటు వేసుకున్నాడు. ఏదో ఆలోచిస్తూ, నృత్యాన్ని చూస్తున్నాడు, విచారకరమైన చిరునవ్వు, అది నా విచారంలాంటిదే. అతని పెదవులపై నృత్యం చేస్తున్నది. అప్పుడప్పుడు అతను నావేపు చూస్తున్నట్టు నాకనిపించింది. నన్ను నృత్యం చేయడానికి పిలవాలని అతనికున్నదేమో. నన్ను కనిపెట్టి చూస్తున్నాడేమో. నా గుండెలు దడదడ కొట్టుకున్నాయి. అతనివేపు దొంగచూపు చూశాను. నృత్యసంగీతం ఆగిపోయింది. "కేప్రిస్ నృత్యసంగీతం కావాలి" అనే కేకలు వినబడ్డాయి.

మరుక్షణంలో మళ్ళీ సంగీతం వినిపించింది. యువతీయువకులలో ఆనందం వుప్పొంగింది. నా కెదురుగా కూర్చున్న యువకుణ్ణి నేనే వెళ్ళి అడిగితే బాగుండుననిపించింది. కాని "అతను ఏమనుకుంటాడో? నేను సరదాగా వున్నట్టు కనిపించను గదా — నాకు యుక్తాయుక్త విచక్షణ లేదనుకుంటాడేమో" ననిపించింది.

కాని సంగీతం మధురాతిమధురంగా తరంగాలుగా

వచ్చి నన్ను పరవశంచేసింది. సముద్రపొడ్డున గాలికి ఎగిరే ఇసుకరేణువులలాగ ఆనందంగా ఆ సంగీత తరంగాలల్లో తేలిపోవాలనిపించింది. ఆ సంగీతం ఆ పరిసర ఉద్యానవనాలంతటా వ్యాపించింది. అది నగరాలలోని ట్రాముల, బస్సుల, కార్ల శబ్దాలకూ, వీధులలో హడావిడిగా తిరిగే మనుషుల కోలాహలానికీ పూర్తిగా భిన్నమైనది.

"ఇప్పుడిక స్త్రీల వంతు — వారే తమ సహనర్తకులను ఎంచుకోవాలి" అని ఎవరో కేకవేశారు.

నేను బెంచీమీదనుండి లేచి నిలబడి నృత్యరంగస్థలం అంచులంట నడుచుకుంటూ వెళ్ళాను. నా పెదవులు చాల గట్టిగా పట్టివున్నాయి, ఉద్రేకంలో సరిగ్గా మాట్లాడలేకపోయాను. "నృత్యం చేస్తావా?" అన్నాను మెల్లగా. నా గొంతుక అతనికి వినిపించే వుండదు. కాని నేను నిలబడడం చూసి నృత్యానికి రమ్మంటున్నట్లు గ్రహించి వుంటాడు.

యువకుడు తటపటాయిస్తున్నాడు. గట్టిగా నిరాకరించడం అతనికిష్టంలేదని నేను అనుకున్నాను. ఇప్పుడే అతనిని స్పష్టంగా చూశాను. ఎంత అందంగా వున్నాడు! అతని జుత్తు వంకలు తిరిగి నుదుటిమీద పడుతూంది. అతని కళ్లుచూస్తే ఏదో స్వప్నలోకంలో విహరిస్తున్నట్టు కనిపించాడు.

నేను అతని సమాధానంకోసం నిరీక్షిస్తున్నాను.

యువకుడు లేచి నిలబడి నా భుజంమీద చేయివేశాడు. అతనికూడా నిలబడడం కొంచెం కష్టమనిపించినట్లు తోచింది నాకు.

"నేను నృత్యంచేయను. కాని నీకో విషయం చెప్పాలనుకొంటున్నాను" అన్నాడు ధైర్యంగా.

"నేను చాలా బాగా నృత్యం చేసేవాడిని. కాని యిప్పుడు చేయలేను. నాకు సాధ్యంకాదు" అంటూ తన కాళ్ళవేపు చూశాడు.

అతని కుడికాలు మామూలుగా వున్నట్టులేదు. అతను అడుగువేసి చప్పుడు చేశాడు. ధ్వని చాల తేలికగా వుంది. అది కృత్రిమమైన కొయ్యకాలు! అతని మనసు నొప్పించకూడదు. అతని కిష్టమొచ్చినట్టూ కనీయడమే మంచిది. కాని నాకేమి మాట్లాడాలో తోచలేదు. అతని దురదృష్టగాధ జ్ఞాపకాల నుండి అతన్నెలా కాపాడడమో తోచలేదు.

"నాతో నృత్యం చేయడం నీకు తలనొప్పిగా వుంటుంది. నాకు నృత్యం చేయాలని లేకపోలేదు. ఈ నృత్యసంగీతం, రణరంగంలో నేను పోగొట్టుకున్న దంతా జ్ఞాపకంచేస్తూ బాధిస్తున్నది" అన్నాడతను

"రండి, నృత్యంచేద్దాము" అన్నాను.

నేను నా చేయి చాపి అతనిని నడిపించాను. అప్పుడు నా మనసులోని విచారాన్ని మరచిపోయాను. నా మనసు కరుణతో, ఆనందంతో పుప్పొంగింది. అతనికి ఆనందం కలిగించాలనే వాంఛ నాలో ప్రబలమైంది. ఒకరినుండి తీసుకునేదానికంటె యిది మహోత్కృష్టమైన ఆనందం.

మేము చేతులు గట్టిగా పట్టుకుని కొంచెం దూర దూరంగా నిలబడే నృత్యంచేశాము. మా అడుగులు నృత్యసంగీతానికి లయ కలుపలేకపోయాయి. కృత్రిమమైన అతని కాలు కొత్తశబ్దాలు చేసింది. అలాంటి శబ్దాలే వాగ్గేయకారుడూ ఎన్నడూ వ్రాయలేదు. అవి గతయుద్ధానికి ప్రతిధ్వనులు.

యువకుడు సంతోషంతో చిరునవ్వు నవ్వాడు. అతను అందమైన యువతితో కలసి నృత్యం చేయడంలేదు. ఎవరినీ ఆకర్షించని యువతితో నృత్యం చేస్తున్నాడు. అయితే అతనెందుకు నవ్వుతున్నాడు? దూరంనుండి మేము హాస్యగాళ్ళలా కనిపిస్తూ వుండవచ్చును. నేను అనాకారిని, అతని నృత్యం బాధాకరంగావుంది. నృత్యానికి చక్కటి వొంపులు, అడుగులు పడాలి. నీటిలో రాయివేస్తే వలయాలు ఏర్పడినట్టు అతిచక్కగా వుండాలి నృత్యం. మేమేదో ఒక్క స్థలంలో అడుగులు వేస్తూ తచ్చాడుతున్నట్టుంది. కాని ఎవరి చేతులో తన వీపుమీద వుండి నృత్యం చేస్తున్నామని కొద్దిగా పరవశత్వం చెందడంలో చాల ఆనందమున్నది.

ఎవరో వచ్చి మామీద పడ్డారు, మేము తడబడ్డాము. నేనాతని చెయ్యి గట్టిగా పట్టుకున్నాను, పడిపోకుండా నిలబడ్డాము.

"కృతజ్ఞుణ్ణి" అన్నాడతను. త్వరలోనే నేను యింతకంటె మంచికాలు అమర్చుకుంటాను. అప్పుడు మళ్ళీ తప్పకుండా నృత్యం చేద్దాము. నృత్యం పూర్తిగా విడిచిపెట్టాలనే వుద్దేశం నాకులేదు.

"నిజంగా యిది ఆనందదాయకమూ, రసభరితమూ అయిన నృత్యం" అన్నాను తొందరగా అతని మాటలను తప్పిద్దామని. ఫిల్ముల గురించీ, కవిత్వం గురించీ, నక్షత్రాల గురించీ, పరీక్షల గురించీ, కాలునుగూర్చి మినహా అన్నిటి గురించీ మాట్లాడదామనుకున్నాను.

"నువ్వు విశ్వవిద్యాలయంలో చదువుకుంటు

న్నావా?" అని అడిగాడతను, నృత్యం అయిపోయాక.

"కాదు, సాహిత్యంలో ప్రవేశిక పరీక్షకు కూర్చున్నాను. ప్యాసవుతానో లేదో తెలీదు" అన్నాను, "మీరేం చేస్తున్నారు?"

"నేను ఫిజిక్సు తొలిసంవత్సరం చదువుతున్నాను. నేను యుద్ధంనుండి తిరిగి రాగానే చదువు ప్రారంభించాలనుకున్నాను కాని అయిందికాదు. లేబొరెటరీలో పని ప్రశాంతంగా వుంటుంది అనుకుంటాను."

"చాలా బాగుంటుంది. ఫిజిక్స్ అద్భుతమైన విద్య" అన్నాను. రణరంగం గురించి కాకుండా ఫిజిక్స్ గురించి మాట్లాడదామనుకున్నాను. యుద్ధప్రసక్తి మా ఆనందానికి భంగం కలిగించడం నాకిష్టంలేదు.

నృత్యసంగీతం ఆగిపోయింది. అతను నా చెయ్యి పట్టుకుని మెల్లగా నా బెంచీ వద్దకు తీసుకువచ్చాడు. మేము ఒకరి ప్రక్కనొకరం కూర్చున్నాము. పైన ఆకాశంలో చందమామ నగరం మీదుగా, అడివి మీదుగా తోటల మీదుగా కదిలి వెళ్తున్నాడు. అవును, ప్రేమికుల చందమామ!

కొయ్యకాలు పెట్టుకున్న నా మిత్రుని పేరు పీటర్. అతను ఒక గ్రామీణ ఉపాధ్యాయుని కుమారుడని తెలుసుకున్నాను, పైలట్ కాదలచుకుని నా మిత్రుడు యుద్ధంలో చేరి, కాలు పోగొట్టుకున్నాడు.

ఆ సాయంత్రం పీటర్ నాతోబాటు మా యింటి వరకూ వచ్చాడు. చాలసేపు మా యింటిగుమ్మం ముందు నిలబడ్డాము. మేము విడిపోయేటప్పుడు "నన్ను మళ్ళీ కలుసుకోవాలని వుందా?" అన్నాడు అతను మెల్లగా. ఓ క్షణం నిశ్శబ్దంగావుండి మళ్ళీ అన్నాడు - "నిజానికి నేను ఎవరి దారికీ అడ్డుగా రాదలచుకోలేదు...ఇతరులు నామీద జాలిపడడం నాకిష్టంలేదు."

నేను ఎంతో కరుణతో ప్రేమతో సమాధానమివ్వాలనుకున్నాను. కాని అంతట్లో మా అమ్మ కిటికీలోంచి పిలిచింది.

"లిడియా, పదకొండు గంటలైంది, లోపలికి రావేం?"

పీటర్ బయలుదేరాడు. అతను నాతో కరచాలనంచేసి గబగబ అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు. కిటికీలో మా అమ్మ నీడ కనిపిస్తూంది. నాకోసం నిరీక్షిస్తూంది. "నిన్ను మళ్ళీ కలుసుకుంటాను. నేనొక సత్పురుషుణ్ణి కలుసుకున్నాను. అతనిని పోగొట్టుకోదలచుకోలేదు. కొయ్యకాలు అయితే నేమి?" అని గట్టిగా కేకవేదామనుకున్నాను. కాని నిశ్శబ్దంగా అలాగే నిలబడి, అతని పాదధ్వనులు వింటూన్నాను. మళ్ళీ మేడమీంచి అమ్మ పిలిచింది:

"లిడియా, ఎన్నిసార్లు పిలవాలే నిన్ను?"

నేను ఆయాసపడుతూ మెట్లెక్కి వెళ్ళాను. నేను లోపలికి వెళ్ళగానే నాకోసం నిరీక్షిస్తున్న మా అమ్మ గట్టిగా చీవాట్లేసింది:

"ఏమిటిది లిడియా, ఎవడో సొట్టవాడితో తిరుగుతూ, యింత రాత్రిపూట యింటికి రావడం."

నేనేమీ మాటలాడలేదు. ఆ నృత్యం నాలో ఏమి మేలుకొలిపిందో నేనామెకు చెప్పగలనా? నాకు ప్రేమించాలనీ ప్రేమింపబడాలనీ వుందని ఆ నృత్యం వెల్లడించింది. అపరిచితుడైన యువకుని వద్దకు వెళ్ళాను. అతని వద్దనుండి ఆనందం కోరాలని అనుకున్నాను. కాని నాలాగే అతను కూడా ఆనందం కోసం వెదుకుతున్నాడని తెలుసుకున్నాను.

చాల రోజులు గడిచాయి. నేను సారస్వత విద్యార్థినిగా చేరాను. కాని ఆ కొయ్యకాలు యువకుణ్ణి నేనెప్పుడూ మరచిపోలేదు. అతనికోసం అనేక చోట్ల వెతికాను. మేము ఎలాంటి వాగ్దానాలు చేసుకోకపోయినా, నాకు ఎంతో ఒంటరిగా వున్నట్టు అనిపించింది.

ఒకరోజున నేను ఫిజిక్స్, గణితశాస్త్రాల విభాగం గేటువద్ద నిలుచున్నాను. ఆ గేటులోంచి వెళ్లే ప్రతివిద్యార్థినీ చూశాను. నాకొక పరిచితమైన మొహం కనిపించింది. పీటర్ కొంతమంది మిత్రులతో వెళ్తున్నాడు. నన్నుచూసి సంతోషంగా చిరునవ్వు నవ్వి, మిత్రులను వదిలిపెట్టి నావద్దకు వచ్చాడు. అతను చాల చిక్కిపోయాడు. అతని కళ్ళల్లో ఏదో సందేహంవుంది. నేనెవరికోసమో నిరీక్షిస్తున్నాననీ, యాదృచ్ఛికంగా తను కనబడినట్లు అతను భావిస్తున్నాడు గాబోలు. కాని నేను యీ సమాగమంకోసం ఎంతకాలమునుండి నిరీక్షిస్తున్నానో నా కళ్లే అతనికి చెప్పివుంటాయి. అతనికి నామీద నమ్మకం కలిగింది. నా భుజంమీద లాలనగా చెయ్యివేశాడు.

# అమ్మా

శ్రీ కన్నెకంటి ప్రభాకరశాస్త్రి

ఆనాడు నీరక్తాన్ని పంచావు..కన్నావు..
కమ్మని పాలిచ్చావు...పెంచావు...
నాతోపాటు నీ ఆశలుకూడా పెరిగాయి
నీ కంటిపాపనైనాను నేను
తల దువ్వావు! తలను ముద్దిడుకొన్నావు
హృదయానికి హత్తుకొన్నావు
అమృతమయంగా దీవించావు
ఆనంద భాష్పాలను రాల్చావు
ధైర్యము దయ ఉగ్గుతో రంగరించావు
ఆశ, ఆశయాలు నూరిపోశావు
నీతులు నేర్పావు న్యాయం చూపావు
ఆడించావు నాతోపాటు ఆడావు
ఆనందించావు అమ్మా ఆనందించావు
అమ్మా! నీ హృదయం అమృతమయ
మమ్మా
నీ మాటలు ప్రేమామృత పాటలు
నీ చూపులు చల్లని సహస్రాంశు కిరణాలు
నీ చిరునవ్వు నాపాలిటి శ్రీరామరక్ష!
నీవే నాకు ప్రథమదైవ మమ్మా.

# స్వీకారం

"రాఘవ"

(గత సంచిక తరువాయి)

"అల్లుడు కాస్తా ఆత్మహత్య చేసుకొన్నాడు" శాంతమ్మ ఆపాళాన, కళ్ళజోడు తీసిపారేసి — "అయ్యో! యిదేం ప్రారబ్ధంరా! ఉన్నట్టుండి సావిత్రిని ఉసూరుమనిపించాడూ!" అని కంటికీ, మింటికీ యేకధారగా యేడవటం మొదలెట్టింది. ఆ సమయంలో యెవర్నెవరు యెలా ఓదార్చుకోవాలో అర్థంగాలేదు. పార్వతి — సావిత్రి మాత్రం గోడు గోడున యేడుస్తూవున్నారు.

సీతాపతికి యీ పిడుగుపాటుతో పూర్తిగా మతి చలించింది. యెన్నడూరాని యేడుపూ, కోపం, అప్పుడొచ్చినయి. కాసేపు తల్లిని నిందించాడు. మరికాసేపు తన్ను తాను తిట్టుకున్నాడు. తను చేసిన దుర్మార్గాన్ని తల్చుకొని కుళ్లికుళ్లి యేడ్చాడు. ఉన్న ఒక్క కూతురి గొంతుకా నిర్దయగా కోసినందుకు యెందులో అయినా పడి, రమణమూర్తిలాగా చచ్చిపోదామనుకున్నాడు. అప్పుడు యీ దావా పీడకూడా వదిలిపోతుందనుకున్నాడు. కాని, సీతాపతి యిలా అప్రయత్నంగా యెన్నో అనుకున్నాడేగాని, సాహసించి యే వొక్కటీ చేయటానికి పూనుకోలేదు. పైపెచ్చు 'మురారి'ని చెడామడా తిట్టటం మొదలెట్టాడు.

"సావిత్రి కాపురం నిలువునా తీసింది మురారే! రమణమూర్తికూడా చస్తూచస్తూ యీ సంగతే వ్రాసి చచ్చిపోయాడు. తనమీద, రమణమూర్తిమీద, యీ దావాని ప్రసాదరావుచేత వేయించింది కూడా మురారే! తనకిచ్చి పెళ్ళి చేయలేదనే వుక్రోషం కొద్దీ మురారే, యీవిధంగా ప్రసాదరావుని రెచ్చగొట్టి దావా వేయించింది. లేకపోతే స్వయంగా ప్రసాదరావు ఎందుకు కలగచేసుకుంటాడు? దీనికంతటికీ కారణం మురారే! అందుకే కాబోలు సావిత్రి పెళ్ళికి మురారి రాకుండా వుంది. యిదా అసలు కారణం! యెంతపనీ! యింత దుర్మార్గుడనుకోలేదు సుమా! తన స్వార్థంకోసం, నా కూతురి పండంటి కాపురం తీస్తాడా! బి.ఏ. చదువుకొని సలక్షణంగా వుద్యోగం చేసుకొంటున్న రమణమూర్తిని ఆత్మహత్య చేసుకొనేలాగా తప్పడు కారణాలు కల్పించి, సావిత్రికి పసుపూ — కుంకం కరువయ్యేటట్లు చేస్తాడా! యిదేనా అయినవాళ్ళు చేసే నిర్వాకం, ఘనకార్యమున్నూ! అందుకనే కాబోలు గుంటూరులో సావిత్రిని చూడగానే, "సావిత్రిని పండక్కి తీసుకొనిపోతున్నావా మామయ్యా!" అని ప్రశ్న వేసాడు. వేసినవాడు వూరుకోకూడదూ! సరాసరి నావెంటబడి నా పెట్టెలోకి ఎక్కి కూర్చొన్నాడు. మంగళగిరి వచ్చేంతవరకూ మౌనంగా వున్నాడు సరేగదా! బుద్ధి మారిందనుకొని, యేదో పనిమీద, ఒక మనిషితో మాట్లాడ్డానికి ప్రక్కపెట్టెలోకి పోయాను. తరువాత యిక, యేం మాట్లాడుకున్నారో, యేంచేసుకున్నారో! మళ్ళా బెజవాడ స్టేషన్లో దిగేంతవరకూ తెలియదు. కాని, సావిత్రి మాత్రం మురారిని అదోతరహాగా చూస్తూండిపోయింది. కారణం యేమిటా అనుకొన్నాను. యిదా తంతు. చివరకు సావిత్రి జీవితం యిలా అవుతుందనుకోలేదు! అంతా కలిసి నన్నిలా అల్లరిపాలు చేస్తారనుకోలేదు? కన్నతల్లి మాటలు విన్నందుకు నా కర్మ కాలుతుందనుకోలేదు. కడాపటికి నేను ఒక దద్దమ్మనయ్యానన్న మాట. యిప్పుడేమిటీ చేయటం? సావిత్రి గతేమిటి? నా దావామాటేమిటీ? తేలకుండా వుంది" అని ఎడాపెడా చిందులు త్రొక్కనారంభించాడు గగ్గోలుగా.

పరిస్థితులిలా వుండగానే సీతాపతి కోర్టుకి హాజరు కావలసిన తేదీ వచ్చింది. యెలా వెళ్ళడమా! అని పరిపరివిధాలుగా ఆలోచించి, యెలాగో యింట్లో వున్న బంగారు వస్తువుల్ని కుదువబెట్టి, వచ్చిన కొద్ది పైకాన్ని లాల్చీ జేబులో వేసుకొని, యింట్లో వాళ్ళని కాసేపు, అవతల మురారిని, ప్రసాదరావుని, మరికాసేపు తిట్టుకొని చక్కా వెళ్ళాడు. యీసారి

కాంతమ్మ దీవించలేదు. ప్రారబ్ధం యెలావుంటే అలా జరుగుతుందని అంతా అనుకొని యెవరికివారు, యేమీ పట్టనట్టు వూరుకుండిపోయారు.

9

ఒక్క పదిహేను రోజుల్లో భర్తతాలూకు కర్మకాండలన్నీ ముగించుకొని సావిత్రి పుట్టింటికి తిరిగి వచ్చేసింది. వస్తూ-వస్తూ బెజవాడలో దిగి మురార్ని కలిసి, తన జీవిత స్థితిగతుల్ని యెరుకపర్చింది. మురారి, యేమీ చేయలేక, కాసేపు కన్నీరుకార్చి, సానుభూతి చూపాడు. బయలుదేరి వస్తుంటే సందేశమిచ్చాడు. అంతకన్నా మురారికి చేయగల్గేదేముంది గనుక.

తీరా, సావిత్రి వెళ్ళినపిదప, సీతాపతి అన్న మాటల్ని నెమరువేసుకుంటూ – "చూస్తూ, చూస్తూ రచ్చకీడ్చారేమిటీ? ఆ ప్రసాదరావుని నేనెందుకు దావా వెయ్యమన్నానూ? యీ గోలంతా లేనిపోనిది నాకంటగట్టారేమిటి? రమణమూర్తిని ఆత్మహత్య చేసుకోమన్నది నేనా? సావిత్రి కాపురం నేను తీశానా? దాని పసుపు-కుంకుమా నా స్వార్థం కోసం దూరంచేసానా? యిదెక్కడి అన్యాయం! యిదేమి నింద! యీ పాపం యేమిటి? యింటిల్లిపాదీ నామీదపడి వూరికే తిట్టిపోయడమేమిటీ? యిలాంటప్పుడు యింక నేను పార్వతి అత్తయ్యను చూసి, పల్కరించి యెట్లా రాగలను? యిప్పటికే నామీద ఆవిడికి అనేక రకాలైన అపోహాలు యేర్పడివుంటాయి. కాదని ధైర్యంచేసి వెళ్ళి యెలా రాగలను? యెట్లా నమ్మించి, నిజాయితీని ఋజువు పర్చుకోను. అంతాకలిసి నన్ను అనవుసరంగా అపార్థం చేసుకున్నారే! యిదెక్కడి ప్రారబ్ధం?" అని మురారి తనలోతాను తర్కవితర్కన చేసుకొన్నాడు. ఆ పూటల్లా మనస్సు స్థిమితం లేకుండా పోయింది. యెక్కడ కాసేపు విశ్రాంతిగా వుందామనుకున్నా వీలులేకపోయింది. యే పనీచేయ బుద్ధి పుట్టలేదు. సావిత్రి చెప్పినమాటలే తిరిగి తిరిగి గుర్తొచ్చి పీడించసాగినయి. యిలాంటి అపవాదులతో అయినవాళ్ళ నెలా పల్కరించటమా అని ఆలోచించసాగాడు.

దురదృష్టవశాత్తు భర్తృవిహీన అవటంతో సావిత్రి, యింట్లోకన్నా గూడ వూళ్ళో యెక్కువ చులకనయింది. వచ్చేపోయే అమ్మలక్కలు అడిగే ప్రశ్నలకు పార్వతి సమాధానలివ్వలేక యెందులో అయినా పడి చద్దామా అనిపిస్తూండేది. యెంద కన్నీరుగాక వుండాలని యెంతకాలం యిలా అజ్ఞాతవాసం గడపాలో సావిత్రికి దిక్కుతోచలేదు. తలెత్తి చూస్తే చాలు, లోకం తల్చే తలపులకు వరుసా వావి లేకుండా వుంది. యెంత కాలం యిలా మూగజీవితాన్ని గడుపుతూ పుట్టింట్లో పడి ముగ్గిపోవటమో! సావిత్రికి అంతుపట్టలేదు. "ఒకవైపు సీతాపతి యెడాతెరపీ లేకుండా అప్పులుచేస్తూ కోర్టుకి ధారపోస్తున్నాడు. యేం లాభం? మాట – మర్యాదా మళ్ళీ దక్కుతయ్యా! పోయిన రమణమూర్తి మళ్లా భర్తగా పునర్జన్మెత్తుతాడా? ఎందుకొచ్చిన ప్రయాస? యెలాగూ తన జీవితం అడివిగాచిన వెన్నెలయిపోయింది, పుట్టింటివద్ద పడి, కుమిలికుమిలి యేడవటం తప్పదు. అలాంటప్పుడు ప్రసాదరావుతో యెందుకొచ్చిన పీకులాట? యింతో - అంతో ఆశ చూపి, కేసు కొట్టిపారవేయటం మంచిదిగదూ! ఉన్న కాస్త ఆస్తీ కూడా గోవిందకొడితేనే గాని తెలిసిరాదేమోలే! జరగనీ... బొమ్మ బ్రతికివున్నంత వరకూ యేమీ ఫరవాలేదు. యెటొచ్చీ అమ్మే గా అందరికీ బరువైంది! ఆవిడ మాట కాస్తా ఆనాడే వినిపించుకున్నట్టయితే యీనాడింత అధోగతిలో వుండేదాన్ని కాదుగా! అయినవాళ్ళ మాటలు వినిపించుకోక పోబట్టేగా తనకీ దురవస్థ పుట్టింది" అని అనేకసార్లు పార్వతితోనూ – తనలో తానుగా అనుకొంది.

ఉన్నట్టుండి ఒకనాటి రాత్రి సర్వాభరణాలంకృతయై పార్వతి, బయలుదేరి వెళ్ళి, రాయుడు త్రవ్వించిన పెద్దనూతిలో పడి ఆత్మహత్య చేసుకొంది. ఆనాటి రాత్రి సావిత్రికీ – పార్వతికీ యెంతోసేపు మాటలు చెప్పుకోవటం జరగలేదు. బహుశా! అర్ధరాత్రి దాటిన తరువాతే పార్వతి చనిపోయి వుంటుందని తెల్లవారిన తరువాత సావిత్రి తల్లి శవాన్ని చూసినప్పుడనుకొంది. సీతాపతి వూళ్లో లేకపోవడం కూడా పార్వతికి వీలుపడింది. ఎలాగైతేనేం, యింటికి పట్టిన విషమ పరిస్థితుల్ని – సావిత్రి జీవిత స్థితిగతుల్ని ఆజన్మాంతం చూస్తూ కాలం గడపకుండా పార్వతి పునిస్త్రీ చావు చచ్చింది. సుబ్బారావుతో సహా పార్వతి వైపు వాళ్ళంతా వచ్చి, సీతాపతిచేత సక్రమంగా దహన సంస్కారక్రియలు జరిపించి వెళ్ళిపోయారు. ప్రసాదరావు కూడా వచ్చి యెక్కువసేపు వుండకుండా, పార్వతి శవాన్ని చూసి, అశ్రుపూరిత నయనాలతో, వెళ్ళిపోయాడు. సీతాపతి మాత్రం తలవంచుకొని

తన దురదృష్టాన్ని - తన ప్రారబ్ధాన్ని తల్చుకొంటూ విచారపడసాగాడు.

యీ విషయం మురారికి యెలా తెలిసిందో తెలిసింది. ఒక్కసారిగా మేనత్తని తల్చుకొని గుండె చెరువయ్యేలాగు యేడ్చాడు. అతనికి తన కళ్ళయెదుట పార్వతి నిలిచినట్లుగా భ్రమించాడు. తన చిన్ననాటి సంగతులన్నీ గుర్తొచ్చాయి. మేనత్త తనంటే యెంత యిష్టంగా వుండేదో వూహించుకొంటుంటే అనిర్వచనీయమైన పూజ్యభావం యేర్పడుతూవుండేది. యిప్పుడెవర్ని తల్చుకొని, ఆ భావాన్ని పూజించుకోవాలో మురారికి అర్థంకాకుండా వుంది. అయిన వాళ్ళలో కూడా ఆత్మీయులైనవారు అంతా వుండరు. మహావుంటే ఒకరో — యిద్దరో వుంటారు. యీ వున్నవాళ్ళలో మురారికి పార్వతి ఒక్కతే. ఆవిడ కాస్తా హఠాత్తుగా ఆత్మహత్య చేసుకొంది. ఒకవైపు సావిత్రి సంసారం కూలిపోవటం — మరోవైపు భర్త దావాల్లోపడి పేరుప్రతిష్ఠలతోపాటు - ఆస్తిపాస్తుల్ని కూడా తగలెయ్యటం — తన మూలంగానే రమణమూర్తి చచ్చిపోయాడని సీతాపతి నొక్కినొక్కి ప్రచారం చెయ్యటం - సావిత్రి కోసం నేనే యిలా ప్రవర్తించానని లోకంచేత అనిపోయించటం మొదలైనవాటికి తలెత్తుకోలేక — యెవర్నీ యేమీ అనలేక - యేమీ చెయ్యలేక — దిక్కుతోచక — చివరకు యెవర్నీ బాధించక — దేనికీ అడ్డుపడక - హాయిగా తనదారి తాను చూసుకొంది. పార్వతి కంటే పుణ్యాత్మురాలు - అలాంటి మేనత్త తనకి లోకంలో యెవరూ లేరని ధృవపర్చుకొని" హృదయాన్ని దిటవు చేసుకున్నాడు.

'అయితే సావిత్రి గతి యేంకాను?' అన్నది పెద్దసమస్యగా తోచింది. సీతాపతికి యీ సమస్య యెందుకో కల్గలేదు. బహుశా! కల్గుతుందేమో? దావా వ్యవహారం చక్కబడిన తరువాత. కాని, పార్వతి పోయినతరువాత సావిత్రికి యేగతి పడితే నేమి? యెవరు ఆనందిస్తే నేమి? ఏం లాభం? కన్నతల్లి కరువైన తరువాత కావాలసినవెన్ని లభిస్తే యేముంది? తల్లి చూసి ముచ్చటపడి ఆనందించటం లేదు, మిగతావాళ్ళంతా చూసి మెచ్చుకోవటంలేదు. అయినా, సీతాపతి సావిత్రికి సుఖం చేకూరుస్తాడని ఏమిటీ నమ్మకం? పార్వతి బ్రతికి వుండగానే చేయలేకపోయాడు గదా! అలాంటివాడు, పార్వతి పోయిన తరువాత సావిత్రిని సుఖపెడతాడా? కాంతమ్మ వూరుకుంటుందా? ఊరివేసుకొని చస్తానందూ! కాబట్టి, కాంతమ్మ వున్నంతకాలం, సీతాపతి పంజరంలో రామచిలుక. సావిత్రికి యిక సుఖమేదీ? జీవితానికి సుందరమేదీ? రెండూ కరువే. ఉండీ వుడిగీ వీచే సుడిగాలికి, రెపరెపలాడే దీపకళికలాగా సావిత్రి జీవితం, ఆ యింట్లో కొట్టుమిట్టాడుతోంది. కాంతమ్మ పెద్దరికం వెలగపెడుతూ, కాలాతీత వ్యక్తిగా ప్రవర్తింపసాగింది. సీతాపతి, భార్యావియోగంతోనూ_దావా పీకులాటతోనూ - హోరాహోరిగా గుంజాటన పడుతున్నాడు. చాటుగా ప్రసాదరావుతో లంచం యిచ్చి, యెలాగైనాసరే, రాజీపడదామని మధ్యవర్తుల్ని పెట్టుకొని ప్రయత్నపూర్వకంగా పాకులాడుతున్నాడు. తన పిత్రార్జితం క్రమేపీ తరిగిపోతుంటే, పార్వతి తాలూకు నగల్ని కబళించాలని కాంతమ్మతో కుతంత్రాలు పన్నుతూ, సావిత్రిని ఓదార్చుతున్నట్లు నటిస్తూ, లాలూచీ వ్యాపారం సాగించటం మొదలెట్టాడు. ఇదే మంచి సమయమనుకొని, కాంతమ్మ కూడ సావిత్రి పట్ల ప్రేమానురాగాల్ని చూపుతూ, వాత్సల్యపూరితమైన మాటలు చెబుతూ, కాశీ ప్రయాణానికి పథకాలు వేయటం మొదలెట్టింది. లోకం మాత్రం 'పార్వతి చావుకీ_రమణమూర్తి ఆత్మహత్యకు' యేదో ప్రత్యేక కారణం వుందనే నమ్మసాగింది. ఉన్నట్టుండి లోకం వెక్కిరింపులు, కాంతమ్మ చేసే రహస్యప్రచారంవల్ల మాటుమణిగినై. సావిత్రికి మునుపటికన్నా చనువు యెక్కువైందనే లోకం — చుట్టపక్కాలు భ్రమించారు. చీటికీ-మాటికీ రాచి రంపాన పెట్టే కాంతమ్మ సహృదయంగా ప్రవర్తించటం, వీలుదొరికినప్పుడల్లా వ్యర్థప్రలాపాలు పక్కే సీతాపతి, మనసిచ్చి, అమృత హృదయుడిలా ఆప్యాయంగానూ - ఆత్మీయంగానూ - పలువిషయాల్ని ఓపికతో చెప్పుకుపోవటం- తల్లి పోయిననాటినుంచీ, కుమిలిపోతున్న తన హృదయానికి వూరలు కల్గించే నిమిత్తం రకరకాలుగా తనింట్లో స్వేచ్ఛను కల్పించి సంచరించమనటం – మొదలైన మెహర్బానీ కృత్యాల్ని సావిత్రి లాలనగా చూస్తూ-శ్రమపడి అర్థంచేసుకొంటూ-ఆశ్చర్యాన్నితురాలవసాగింది. "యిందులో యేదో మోసం వుంది" అని ఆలోచించి నిర్ణయించుకొంది.

(సశేషము)

# చందమామ

శ్రీ శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి



చందమామ చందమామ
ఎందుదాగి యున్నావు?
అందమింత చూపి కనుల
విందొనర్పగా రాదా?

నినుజూచిన అపనిందలు
మనుజులపై బడునంచును
మును చెప్పెడో మా పెద్దలు
వినిపించి రదెందులకో?

నీ చల్లని చూపులతో
దాచియుంటి వమృతమ్మును
చూచిన మా హృదయమ్ముల
దోచుకొనెద వంచు తోచె

నీరాకకు కలువ కన్నె
ఆరాటము నొందుచుండ
తారలతో వినువీధిని
చేరి కులుకు చుందువేల?

నీ వెప్పుడు ముఖభాగమె
మా వైపున చూపింతువు
ఆ వెనుకను ఏమున్నదో?
ఏ వలపుల సిరులు గలవో?

మా చుట్టూ నెలనెలదో
బూచులాడి తిరుగుచుండి
ఆ చీకటి అమవసనిశి
నే చెంతను దాగినావో?

నీ వోషధులకు నిధివని
నీ వొక క్షయరోగివని
ఏవో అర్థం కానివి
భావము లుదయించు మాకు.

# మామయ్య వంట

'వినోదానంద్'



"ఇదిగో–నామాట వినండి! లక్షణంగా హోటలు నుండి క్యారియరు తెప్పించండి. నాకేదో కడుపు నొప్పిగా నున్నది – నేను భోంచేయను. మీకు, పిల్లలకూను _ పోతేపోయింది ఒక రూపాయి" అంది అత్తయ్య.

"చాల్లే ఊరుకో – యీ ఒక్కపూట భాగ్యానికి హోటలునుండి తెప్పించాలా! ఆ కూర, చారునీళ్లు, పచ్చడి యింట్లో చేయలేనూ" అన్నాడు మామయ్య.

అది ముట్టయిన మూడవరోజు. మర్నాడు అత్తయ్య ఎలాగూ స్నానంచేసి యింట్లోకి వస్తుంది. గడచిన రెండు రోజులు వాళ్ళ పెద్దబ్బాయి వంట చేసిపెట్టాడు. అంటే వాళ్ళ కాలేజి స్కౌట్ల క్యాంపులలో వంటచేసి మంచి అనుభవం కలవాడు. కాని ఆరోజు కాలేజి సెలవయిపోయి తెరవడంవల్ల వాడు ఆ ఉదయం బండికి వెళ్ళిపోక తప్పిందికాదు.

"అయితే పోనీయండి - అన్నం మాత్రం ఉడకేసి, సాధకాలను హోటలునుండి తెప్పిస్తురూ! _ ఎందుకొచ్చిన శ్రమ మీకిది" అన్నది అత్తయ్య.

మామయ్యకు ఆమె మాటలు రుచించక "ఏమిటీ నస అస్తమానం! నీవలా ఒకమూల పడియుండి చూస్తుండరాదూ!" అన్నాడు కటువుగా.

"మీ యిష్టం... నాకెందుకులెండి!" అంటూ గదిలోకి వెళ్ళింది.

"పెద్దమ్మాయ్! సుబ్బిని కట్టెలు తెమ్మనమ్మా! యిప్పటికే ఎండెక్కింది" అంటూ మామయ్య కేకలు ప్రారంభించాడు.

"సీనూ! కిరసనాయిలు, నిప్పుపెట్టె ఎక్కడున్నవో చూడరా."

"మొన్ననే చెప్పానుకదండీ కిరసనాయిలు అయిపోయిందని _ నిన్నరాత్రి కటిక-చీకట్లో పండుకున్న సంగతి జ్ఞాపకంలేదూ!" అని సాగదీసింది విస్తళ్ళు కుడ్తూ అత్తయ్య.

"ఈ పూటకు కట్టెలున్నవిలే సుబ్బి! – కిరసనాయిలు త్వరగా తీసుకొని రా" అని కేకవేశాడు మామయ్య.

"అమ్మాయ్! యీవేళ మనం అన్నంలోకి ఏమి చేసికుందాం చెప్పు" అన్నాడు మామయ్య కూతురుతో తనేదో ఘనకార్యం చేయబోతున్నట్లు.

"బంగాళాదుంపల కూర – హోటల్లో చేసినట్లు ఉల్లిపాయలు వేసి చేస్తే బాగుంటుంది నాన్నా!" అన్నది అమ్మాయి.

"దుంపలు సన్నగా తరిగి నేతిలో వేయిస్తే బాగుంటుంది నాన్నా!" అన్నాడు సీను.

ఇంతలో అత్తయ్య కలుగజేసికొని "ఏమీవద్దు _ నిన్నటి మినుముల చింతపండు పచ్చడి యున్నది. కానీనన్ని వడియాలు వేయించుకొని, వెంకమ్మ దగ్గర ఒక పావుసేరు పెరుగు పోయించుకుంటే చాలు యీ పూటకు" అన్నది అత్తయ్య.

"నమర్ని యిప్పుడెవ్వరూ అడగలేదు _ నోరు మూసుక కూర్చుంటే చాలు! నా తిప్పలు నేను పడతాను" అన్నాడు మామయ్య.

మనిపర్సు తీసి "సీనూ! బజారుకెళ్ళి ఒక అరవీశ బంగాళాదుంపలు తీసికొని రా మంచివిగా చూచి" అంటూ రూపాయనోటు చేతికిచ్చాడు.

"చిన్నమ్మాయ్! సుబ్బిని కిరసనాయిలుకు పంపి తెప్పించు. వీధిలో పెరుగు అమ్మే వెంకమ్మ వస్తే పిలువమని చెప్పు."

కొంచము సేపటికల్లా సుబ్బి కిరసనాయిలు తెచ్చి, కట్టెలు విరిచి కుప్పగా పెట్టింది. మామయ్య రెండు పిడకల నిండా కిరసనాయిలు పోసి పొయ్యి ముట్టించబోతే అగ్గిపెట్టె అగుపడితే కదూ! విసుక్కుంటూ "ఆ పాడుముండను అడుగు అగ్గిపెట్టెను ఎక్కడ పెట్టిందో!" అన్నాడు. ఇంతలో దేవుడి పటం ముందు అగ్గిపెట్టె కనుపించి "వద్దులే–రా_యిక్కడ యున్నది" సుబ్బిని పిలిచి పిడకలు ముట్టించాడు. త్వరగా పొయి రాజుకోవాలని పది పుల్లలు పొయిలో తురిమేసరికి మంట ఆరిపోయింది. పిడకలు చల్లారిపోయినట్లు అనిపించింది.

"ఈ వెధవ పచ్చివి లేకపోతే మంచివి వేయించుకోకూడదూ! పాడుముండ" అని మామయ్య అంటుంటే సందులోనుండి తొంగిచూచిన సుబ్బి నవ్వినట్లు వినబడింది.

"బాగుంది. ఎప్పుడూ లేంది యిదేమి అన్యాయం! యీ ముండ, రండ తిట్లేమిటీ, రభస ఏమిటీ — మంచివంటే" అంటూ నడవదాటి వచ్చి పొయితట్టు కిటికీలోనుండి చూచి "అదేమిటండీ! అన్ని పుల్లలూ! సుబ్బీ నీవైనా చెప్పకూడదటే. మొదట నాలుగు పుల్లలు పెట్టి అవి అంటుకున్న తరువాత మరి రెండు పెడితే పొయి బాగా మండుతుంది.

ఆ మాటలు వినేసరికి మామయ్యకు చాల కోపం వచ్చింది. కాని తన నిస్సహాయస్థితిలో చేయునది మరేమిలేక పండ్లు పటపట కొరుక్కొని భార్య చెప్పినట్లు చేశాడు. అందరి అదృష్టమా అన్నట్లు పొయ్యి మండింది. భార్య చెప్పినట్లు మూడు లోటాల బియ్యంపోసి కడిగి గిన్నె నిండా నీళ్లుపోసి పొయి మీద పెట్టాడు. అయిదు నిముషాలయిందో లేదో మూత తీసి బియ్యం ఉడుకుపట్టినవేమో చూచాడు. అప్పటికింకా నీళ్లైనా వెచ్చబడలేదు. మంట జాస్తిగానుంటే త్వరగా అన్నమగుతుందని గుక్క త్రిప్పుకోకుండా విసనకర్రతో విసిరేసరికి మండు పొయ్యి కాస్తా ఆరిపోయి పొగరాజడం మొదలు పెట్టింది. మళ్ళీ కిరసనాయిలు పోసి, అగ్గిపుల్ల గీచి ముట్టించాడు, ఈసారి బాగా మండింది. పది నిముషాల కంతా కుతకుతమనే శబ్దం వినిపించింది. నీళ్ళు జాస్తి పోశానేమో ననుకొంటూ రెండుమూడు గరిటెల నీళ్ళు తీసి పారబోశాడు. అన్నం ఉడికిందేమోనని గరిటెతో ఎత్తిచూస్తే యింకా బియ్యంగానే యుండింది. మళ్లీ ఒక లోటానీళ్లు గిన్నెలో పోసి మూతపెట్టాడు చాలవేమోనని.

ఇంతలో బంగాళాదుంపలు తెచ్చారు. "సుబ్బీ! కత్తిపీట ఎక్కడుందో అడుగు" అన్నాడు మామయ్య అత్తయ్యకు వినబడేటట్లు.

ఆమె "నాకేం తెలుసూ! అబ్బాయి ఎక్కడ పెట్టాడో-కొంచము వెతికితే కనిపించదూ" అన్నది.

"ఆ...చిత్తం — వెతికితే కనుపిస్తుందని నాకు తెలియదూ! — నీవు జోస్యం చెప్పాలా...పెద్దమ్మాయ్! కత్తిపీట ఎక్కడయుందో చూడూ — సీనూ! నీవుకూడ వెతకరా."

"నాకు తెలియదు నాన్నా! నాకు ఆకలి అగుతున్నది" అంటూ ఏడుపు మొదలుపెట్టాడు సీను.

మామయ్యకు కోపం జాస్తయింది. ఒకప్రక్కన అన్నంగిన్నె ఎప్పుడు దించాలనో తెలియలేదు. పొయ్యిమీది గిన్నె — వేడిగా నుందాయె! ఎలాగ దించడమోనని భయం! కత్తిపీట అగుపడలేదు. ఈ సమయంలో సీను ఏడుపు...

"ఇంకా 9 గంటలయినా కాలేదు. అప్పుడే ఆకలేమిటి? తెల్లవారకముందే గిన్నెడు కాఫీ త్రాగావు కదా" అని దబాయించాలని ప్రయత్నించాడు కాని నిజానికి 11 గంటలు కాబోతుండుటచే పిల్లలు ఆకలితో నకనకలాడిపోతున్నారు. పాపం సీను వెక్కివెక్కి ఏడుస్తూ చొక్కా విప్పేసి వాళ్ళమ్మ దగ్గరకుపోయి చాపమీద పండుకున్నాడు.

పెద్దమ్మాయి "నాన్నా! పైన చెక్కమీద నున్నట్లుంది చూడు" అన్నది నిక్కినిక్కి పైన చూస్తూ.

"నేను చూచి మీకు అన్నీ అమర్చిపెట్టేటట్లయితే మీరంతా ఎందుకూ! వండి వార్చిపెడితే తినడానికా! నా కోటుజేబులో పేనాకత్తి యుంది తీసికొని రా."

పేనాకత్తితో దుంపలు తరుగ నారంభిస్తే ఒక దాని ఆకారం యింకొకదానికి లేదు. చిన్నవి, పెద్దవి నానాగోత్రాలుగా తయారయినవి ముక్కలు.

ఇక పొయ్యిమీదనున్న గిన్నెను దించ ప్రయత్నం ప్రారంభమయింది.

"సుబ్బీ! పక్కయింటికి పోయి పాత న్యూస్ పేపరు యిప్పించుకరా. అది పోతే యివ్వరేమో అమ్మాయ్ నీవే వెళ్ళిరామ్మా!" అన్నాడు మామయ్య పెద్దమ్మాయితో.

రెండు నిముషాలయినా యింకా రాలేదు అమ్మాయి. యీ లోపల తన తుండుగుడ్డతో పట్టుకొని దించడానికి ప్రయత్నించాడు. పాపం ఒక కొనకు నిప్పు అంటుకుంది.

"ఏమండోయ్! ఎక్కడో గుడ్డ కాలుతున్న వాసన వస్తున్నది చూడండి" అన్నది అత్తయ్య గొంతెత్తి.

"ఏమీలేదు-అన్నం మెతుకులు రెండు పొయిలో పడ్డవి" అంటూ ఎలాగో బ్రహ్మప్రయత్నంతో అన్నంగిన్నె దించి క్రిందపెట్టి తుండుగుడ్డను మూల పారేసి దుంపలు తరగడానికి కూర్చున్నాడు. దుంపలు తరిగేకొద్దీ నూతన భావపరంపరలతో వేలు కాస్తా కోసుకున్నాడు. "అబ్బా!" అని అరుస్తూ రక్తం కారుతున్న చేయితో తడిగుడ్డ చుట్టడానికని లేచాడు. తేలేమైనా కుట్టిందేమోనని అత్తయ్య కిటికీ దగ్గరకు పరుగెత్తుకొని వచ్చింది.

"అమ్మాయ్! మొద్దులాగా నిలబడతావేం! —

తుండుగుడ్డ తీసికొని రా" అంటూ గొడవ ప్రారంభించాడు.

"ఏందమ్మా! మంచివంటే - మీ యిద్దరి తిట్లతో నా ఒళ్ళు చిల్లులు పడుతున్నది. నాకేం తెలియదు పోండి" అంటూ పెద్దమ్మాయి మంచం వాల్చుకొని పండుకుంది. మూలన పడేసిన తుండుగుడ్డ సంగతి జ్ఞాపకమువచ్చి చూసేసరికి సగం తుండుగుడ్డ కాలిపోయింది. అది భార్య ఎక్కడ చూస్తుందోనని ఆమెను కసిరి ఏదో పనిమీద అవతలికి పంపి, గుడ్డ పేలికను చింపి తడిపి వేలుకు కట్టుకున్నాడు. ఇంకా దుంపలు తరిగితే వేలు కోసుకుంటుందేమోనని ఒక ప్రక్క భయం - అందుచేత దుంపల నలాగే ఉడకవేసి చల్లారిన తరువాత వాటిని నలిపి తిరుగబోత వేయడానికి బాణలి పొయిమీద పెట్టి "పెద్దమ్మాయ్! యిలా రా _ కోపపడితే ఎలాగమ్మా! యిదిగో యీ రెండణాలు తీసికొనిపోయి బొమ్మలు కొనుక్కో... మీయమ్మను దుంపల తిరగబోతకు యేమి వేయాలో అడుగు" అంటూ నేతిగిన్నెను బాణట్లో క్రుమ్మరించాడు.

"ఆవాలు, జీలకర, మినపప్పు, మిరపకాయలు చాలు నాన్నా!" అన్నది అమ్మాయి.

"ఎంతెంత వేయాలో అడుగమ్మా."

"నాకు తెలుసులే నాన్నా!" అంటూ తిరుగబోత గింజల డబ్బా తెచ్చేసరికి యింతలో తనతో చదువుకునే అమ్మాయి వచ్చి బయట "లీలా!" అని పిలువగానే పెట్టె అక్కడపెట్టి వెళ్ళిపోయింది.

ఆ పెట్టెలో నాలుగు పెద్ద డబ్బాలు, 12 చిన్న డబ్బాలు ఉన్నవి. ఒకదాంట్లో మెంతులు, మరొకదాంట్లో జీలకర, యింకొకదాంట్లో మిరియాలు ఉన్నవి. వాటిని చూచేసరికి అయోమయంగా తోచింది.

"ఇటువంటి చదువురాని ముండ వుంటే వంటయిల్లు యింతే! ఆవాలు ఏవో, మెంతులు ఏవో ఆ డబ్బాలమీద చీట్లువ్రాసి అంటించకూడదూ! ఆ వెధవ ఆవాలను ఎక్కడ తగులబెట్టావు యింతకూ!" అన్నాడు చిందులు త్రొక్కుతూ.

"కడపటి వరుసలో ఎడమచేతి తట్టు రెండవ డబ్బాలో ఉంటవి చూడండి అన్నది అత్తయ్య.

చారెడు ఆవాలు, మినపప్పనుకొని చారెడు పెసర పప్పు, తుంచకుండానే ఆరు, ఏడు మిరపకాయలు వేశాడు. మంట బాగాయుంది. నెయ్యి మాడు వాసన కొడ్తున్నది. ఆవాలు చిటపటమంటూ ఎగిరి కండ్లలో పడుతున్నవి. బాణలికి ఒకతట్టు చెమలేదు. "ఏమిచేయాలి దేవుడా!" అని కంగారుపడుతుంటే అమ్మాయి వచ్చి, "నాన్నా! యీ రోజున బడికి దొరసానమ్మ వస్తుందట! నాకు త్వరగా అన్నం పెట్టు వెళ్ళాలి" అన్నది కంచం చేతపట్టుకొని.

"పంతులుగారు యీరోజు యింకా ఆఫీసుకు బయలుదేరలేదే!" అంటూ వాళ్ళ ఆఫీసు గుమాస్తా వెంకటకృష్ణయ్య నడవలోకి వచ్చాడు. సందువాకిట్లో నుండి వంటయింట్లో జొరబడి కోతి ఒక డబ్బా ఎత్తుకవెళ్ళింది. అప్పుడే మిషన్ స్కూలు గడియారం 11 గంటలు కొట్టింది.

"భవతీ భిక్షాందేహి" అంటూ ఒక కుర్రవాడు గుమ్మం గడపెక్కాడు.

వంటయింటి నిండా చిందరవందరగా సామానులు. పెద్దమ్మాయి నిస్పృహతో మంచముమీద వాలింది. సుబ్బి వాకిట్లోకి వచ్చి, "నేను నూతి దగ్గర గుడ్డలుతుకుతుంటిని కదా కోతిని నేనెక్కడమ్మా చూచేది! అది నాతో చెప్పి వచ్చిందా - ఆరు నెలలయింది తల్లీ! నాకియ్యాల్సిన డబ్బు పారేస్తే నేను వెళ్ళిపోతాను _ పనికి వేరే మనిషిని చూచుకోండి!" అన్నది తనకు పనిచేయడం భారంగానున్నట్లు.

ఇక కూర ఏ పాకాన దిగినది, ఉప్పు వేసిందీ లేనిదీ, అన్నం తినడానికి పనికొచ్చిందీ లేనిదీ మీరే యూహించుకోవచ్చు. చివరకు పాపం యీ గడబడను చూచి ప్రక్కయింటి సీతమ్మ పిల్లలను పిలుచుకొనివెళ్ళి తనయింట్లో అన్నం పెట్టింది. పాపం ఆమె అత్తయ్యకు, మామయ్యకు కూడా మళ్ళీ అన్నం వండి కూర, పులుసుతోసహా క్యారియరులో పెట్టి పంపిస్తే _ మామయ్య భోంచేసి ఆఫీసుకి వెళ్ళేసరికి మధ్యాహ్నం రెండు గంటలయింది. తను ఆఫీసుకు ఆలస్యంగా వెళ్ళినందుకు పై అధికారికి మామయ్య ఏం సంజాయిషీ చెప్పుకున్నాడో పాపం!

ఇటువంటి సంఘటనలు, సన్నివేశాలు ఎప్పుడో కప్పుడు మీ యిండ్లలో జరిగియుండవంటారా!!

# కుమారోదయం

విద్వాన్ యం. వి. ఆర్. కృష్ణశర్మ, ప్రాచీనగ్రంథమండలి

చంచల ద్రక్తాక్ష సంయుత యగుచు, విస్తారితగ్రీవమ్ము దక్కుఁజేసి,
ఉచితపుచ్ఛమ్ము సంకుచితమ్ముగావించి, నిల్చిపత్రాల విదల్చివైచి,
మెల్లఁగానడుచుచుఁ జల్లగా నటునటు దిరుగుచు, వలయాకృతిని నొనర్చి
యధికభయంబును నొదవినచిత్తంబు, మాటిమాటికి నట దేటపరచి,

పత్నిసంయుక్తుఁడైన యప్పంచశరుఁడు,
స్నానకలిత సుధాప్రాండజసితమైన
పేనలీల, నచ్ఛాంశుసద్విమలకాంతు
లలరు, నొక్కపారావత మటకువచ్చె.

పరమేశుండు తదాకృతింగనుచు, విభ్రాంతోరుచేతస్కుఁడై
కరమాశ్చర్యమునొంది, యాత్మనఁదదాకారంబు నయ్యగ్నిగా
నరయంగల్గి, మహోగ్రకోపసహితుండై యున్న, నీక్షించి వి
స్తరభీతిన్నిజరూపముంబడసి, యాతండంత దీనస్థితిన్.
పరమేశా! క్షమియింపుమీ విహగరూపంబందు నిచ్చోటికి
న్నరుదెంపం గృపనింపురూపుడఁవు దేవానీకతాపాళి వి
స్తరముందీర్పఁగ శక్తియుక్తుఁడవు, లీలామాత్రలోకంబుల
న్నరయన్ సృష్టిలయాది కార్యములఁ జేయన్ మేటి వెప్పట్టునన్.

అసురవిసర పరాభూతు లమరగణము,
సతము భవదీయ పాదదర్శనములేమి,
నమితదయనీయ దుస్థితి నమరియుండె,
నిజసతీవశంవదుఁడవై నిలచుకతన.

తావక సేవలేమి విబుధప్రకరంబు నిరాశ్రయాత్ములై,
భావనఁజేయఁ దద్విమలపాదసరోజయుగప్రతీక్షణా
భావము పొందలేక, తుదిభావమునందిటు లుందువంచు సం
భావనఁజేసి, కోరనను, వచ్చితి నీగతిసైపు మీశ్వరా
ఈ నీభృత్యుఁడొనర్చు కార్యమునుస్వామీ! యింకమన్నించి, యా
దీనావస్థ నిమగ్నమానులగు నాదేవాళిబాధాళి, వే
గానందీర్ప సృజింపు మాత్మజుని, లోకక్షేమసంధాతవై
దీనాలాపములాలకించియు, మహాదేవా! కృపాభావవై

భవదీయాత్మజుముందునిల్పికొని, యాపాకారి దేవారినిన్
బవరంబందునగూల్చి దేవపటలీ బాధాళినిందీర్చి, య
ద్దివిఁబాలింపఁగలండు, పెంపడరుశాంతింగూర్చి యశ్రాంతమున్
భవ! కారుణ్యకటాక్షవీక్షణల దేవాధ్యక్షు రక్షింపవే?

అతిదీనుండయి జాతవేదసుఁడు నిట్లాడంగ నాలించి, యు
ద్గతకారుణ్యనిబద్ధుఁడై శివుడు క్రోధంబెల్ల పోనాడె, సం
గతచాతుర్యవచోవిలాసులు, చమత్కారైక వాగ్రీతులన్,
మతి ధీరోత్తమ సత్కృపాగరిమ సంపాదింతు రింపారఁగన్.

పరమేశుండు సురారిఁగూల్ప సుతునుత్పాదింప భావించి, భీ
కరకల్పాంతమహానలంబగు నమోఘస్వీయ హేమద్యుతిం
జారఁజేసెన్వడిజాతవేదసునియందున్, దాన నాతండు వి
స్తరబాధాహతినిన్ మహా వికృతచంచద్రూపుఁడై యొప్పినన్.

గిరిశాలింగన సౌఖ్యమగ్న మదన క్రీడామనోలగ్న భూ
ధరసత్పుత్రి తదంతరాయకరుఁ జిత్తంబందుఁ గోపించి, స
త్వర మయ్యగ్ని నిసర్వభక్షకుడుగాఁ. దద్ధామగర్భుండుగాఁ,
బరభీతావహవర్తనుండుగ, శపింపం బావకుండయ్యెడన్.

దక్షశాపక్షయుండు పద్మారివోలె;
గాఢహిమ పరిప్లుష్ట పంకజవిధమ్ము;
భవమహోగ్ర తేజశ్చయ భవవిరూపుఁ
డగుచుఁ, బరమేశునానపై నరిగెనపుడు.

శృంగార గర్భితస్విన్న వాగ్భూతుల, లలితవినోదంబు గలుగ జేసి
ఘర్మజల కళంక కజ్జలంబును వడి నుత్తరీయంబుచే నొత్తివైచి,
విగళత్ప్రసూనమై విరజిల్లునంసానఁ, జెదరిన కేశముల్ జిక్కుఁదీసి,
పారిజాత కుసుమ భవ్యమాలికలచే మించుసంధాన బంధించివైచి,

అతను మంత్రాక్షరములో యనెడియట్లు,
రమ్యగతి మృగమదపత్ర రచనఁ జేసెఁ
బావకాలోకన కుపిత స్వాంతనగజ
కంతలోకాధిపతి, యంతకాంతకుండు.

శంకరార్పిత తాటంక సంగమాన
శైలరాజతనయ ముఖసారసమ్ము
దండయాత్రకై పయనించు దర్పకుమణి
చక్రయుగయుతస్యందన సరణినొందె.

గిరిశుఁడంతట పార్వతీగ్రీవమందు
లీలఁ గ్రైసేయు శ్రేష్ఠముత్యాలమాల,
మేరుపర్వత శిఖరమ్ము మీఁదఁ దలరు
నమర వాహినీ శోభల హాస్యమాడు

అభవుఁడంతట స్వీయఫాలాక్షమందుఁ
గాటుకం జేసి, తన్నేత్రకంజములకుఁ
బొంకముగ నుండునట్టు లలంకరించి,
నీలకంఠాన శేషంబు నిలిపి వైచి,

పర్వతాత్మజ మృదులాంఘ్రి పద్మములకు,
భవ్యలాక్షార సానులేపనము సేసి,
మౌళిగంగాంబులఁ గడిగె నీలగళుఁడు
నిజకరాంగుళీరక్తిమ నిలువకుండ.

దివ్యభస్మానులిప్తాత్మ దేహమందుఁ
బేర్మి నిగ్రహించి యాదర్శబింబము భవుఁ
డద్రిజకొసంగి, స్వీయకృతాసమాన
సుందరాలంకరణములఁ జూడుమనఁగ.

భూతపతి దత్తమణి ముకురమందుఁ
దనదులావణ్యమరసి, చిత్తంబునందు,
నభవురాగంబు, స్వీయభాగ్యంబటంచు
భూధరాత్మజ మదిమున్గె మోదజలధి

అంతట దేవతానికర మప్పరమేశ్వరు దర్శనార్థమ
త్యంతకుతూహలాత్ములయి, యన్నగసన్నిధిఁ జేరి, స్వీయవృ
త్తాంతము నంత కాంతకు పదద్వయిఁ జెప్పుమటంచుఁ గోరగా
నంతరయాననంది చని, యంతయుఁ దెల్పిన శూలిసన్నిధిన్

విని శూలి, వారలటకుం
జనుదెంపంగ ననుమతినొసంగె, నతఁడున్
జనుదెంచి, వారికడకున్
వినిపించె మహేశునానఁ, బ్రీతిఁ దలిర్పన్.

వారు మహేశుదర్శనపుభాగ్యము గల్గుచునున్నదంచు, స
ద్వారిగ సంతసంపడుచు, భావములందున వేచియుండినన్
మారనిహారియామును మార విలాస విహారి యిప్పుడా
గౌరి మనోవిహారి కఱకంఠుఁడు సత్కరుణావిచారియై

హైమవతీకరాంబుజమునంతట స్వీయకరాన మీటియున్
స్వామియుఁ గేళికా భువన సంస్థలిదాటియురాగ, దేవతా
స్తోమము భక్తియుక్తులయి శూలికి వందనమాచరించి రు
ద్రామము శైలపుత్రికిఁ బదంపడి మ్రొక్కిరి నిశ్చలాత్మలన్.

కలఁతన్ జెందకుఁడయ్య! మీకు శుభమా కాలంబునేతెంచు బా
ధలుపూర్త్యంగనుధ్వాం మట్లవెసనంతంబౌను, నత్యంత సం
కలితాసౌఖ్య పరంపరల్ గలుగు నిశంకన్ లేక ధైర్యోన్నతిన్
నిలువంబూనుఁడటంచు వారలకుఁ బల్కెన్ శూలిసంప్రీతిగన్

వారల నాదరించి, స్మరవైరి పదంపడి వీడుకోల్పియున్
గూరిమిఁబత్నితోడ ముదిగోడను నెక్కె, వియత్తలంబుపై
వారక దేవతానికరవందనవారమునందిపోవు చ
వ్వారి రయంబుమీఱఁ దనవాసమునీశుఁడు సేరెఁ, జేరియున్.

స్ఫటికశైల శృంగంబులఁ జంద్రమౌళి
పార్వతీ ద్వితీయుండయి పరమశక్తి
శుద్ధకలధౌతవేత్ర హస్తుండు నంది
ముందుమార్గంబు జూపింపనందుఁ జొచ్చె.

అటభూతేశ్వర తేజముంబడసి, ఘోరాతేతరూపంబుతో
బటువేగంబునరాఁగ నింద్రుకడకున్ వైశ్వానరుం, డాతఁడున్
జటులాశ్చర్యనిమగ్నమాన కలితా చంచత్కృపాదృష్టి న
న్నిటలాక్షుండొనరించు కార్యము మదింజింతించ గాఢమ్ముగన్

అనలుండెల్ల వచింపఁగావినియు, దేవాధీశుఁడాలించి, యా
త్మనఁ జింతించి, యెఱుంగలేకసలు సంతాపంబు శాంతింపఁ బా
వని మందాకిని సంగ్రహింపఁగను సంభావింపఁగాఁ బెంపు శ
క్తినిఁ గైకొన్నదటంచు నెంచి యిటు సక్తింబల్కె, నయ్యగ్నితోన్.

అనలా! శంకరతేజముంగొనగ సాధ్యంబౌనె నెవ్వారికై
సను, గంగానది తత్సతమణిగ్రహింపన్ శక్తిసంయుక్త కా
వున దద్వాహినిలోనమజనము పెంపుంజేయ నద్దానిఁగై
కొనునంచున్ వచియింపఁజబావకుడు సంక్షోభాత్ముఁడై యంతటన్.

చని మందాకినియందు మజ్జనమటులన్ సల్పంగఁ దత్తేజమ్మం
దునఁ జేరంగఁ బ్రశాంతినొంది మదినందున్, వేగనందుండియుం
జనె, భూతేశమహోగ్ర భీతియుత తేజఃప్రాప్తసంతప్త భూ
రిగిమగ్నంబునఁదత్సురాపగయునోర్మి న్మీరెనవ్వారిగన్.

ప్రళయపావక సంతప్త వార్ధివిధము
శంభుతేజశ్శిఖా భారసమితిచేత
నతిమహోష్ణజలాన్వితమైనగంగ
వారిజంతువులద్దాని వదలివైచె.

అథవ తేజోగ్ని తప్తనిజాంబులెల్లఁ
బొంగిపొరలుచుండఁగఁగాంచి గంగయంతఁ
గష్టభరముగ భరియింపఁ గలుగుచుండె
నీశుతేజంబు నేరు భరింపఁగలరు?

అమరవాహినీ జలమజ్జనానురక్తి
మాఘమాసాన నొకదినమందునందు
సరసిజాప్తోదయోన్ముఖ సమయమందు
వచ్చినారు షట్కృత్తికలిచ్ఛనొత్త.

ఏనది యిష్టచిత్తుఁడయి, యింపుఁదలిర్పశిరమ్ముపైని, నీ
శానుఁడు దాల్చినంతట భృశమ్ముఁబవిత్రతఁగాంచియుండెనో?
యేనది బొందినన్ దురితబృందము లెల్లెడవల్లకుండునో?
యానది భవ్యవిష్ణుపదినారసి వారలు భక్తియుక్తలై.

ప్రణతుల్ సేసి, యనేకరీతుల మతింబ్రార్థించి యవ్వారు, మ
జ్జనముంజేయఁగ. దానశూలినిజతేజంబాత్మ దేహంబులం
దున వేగంజొరఁబారఁ, దద్భవమహోదుర్వారతా పొంగులై
మనమందున్నిజభర్తృభీతిజనియింపం బెంపువేగంబుగన్.

దరికివచ్చిఁ, తత్తేజమ్మునా శరవణమ్ము
నందు భద్రమ్ముగానుంచి యరిగిరమ్ము
నదియుక్షణకాలమాత్రమ్ము నందుదివ్య
షణ్ముఖాకారియయి ప్రాణసహితమయ్యె.

# నేరస్థుడు

"రవి - చంద్ర"



కోర్టు క్రిక్కిరిసి ఉంది. కిటకిటలాడే జనం, 'కట కటా' అని నోట అనకున్నా, బోనులోని జీవి యాకారాన్ని, ముఖాన్ని చూచి ఆర్ద్రహృదయంతో స్తబ్ధులై యావత్తూ వినడానికి సంసిద్ధులైయున్నారు.

ఒకమోస్తరుగా పేరుమోసిన ఆసామిని చచ్చేటట్టు చితకబాదటమే ఆ 'దోషి'యొక్క నేరం. అతణ్ణి నిజంగానే నేరస్థుడంటారు కదూ మీరు? అవును — అలానే మీరు అనగలరు. కాని, ఆ నేరస్థుడు — కాదు, ప్రాణి - పేరుప్రతిష్ట లార్జించుకొన్న జడ్జి జగన్నాధాన్నే సంక్షోభంలో ముంచేశాడు.

జడ్జి ప్రవేశించాడు కోర్టులోకి. గౌరవ సూచనలన్నీ జరిగాయి. యథావిధిని అలవాట్లన్నీ పూర్తయాయి. ఒక్కసారి నల్లటి కళ్ళజోడు సరిజేసి చూశాడు జగన్నాధం. మళ్ళీ నిన్నటి మొహం! మళ్ళీ తన హృదయంలో నిన్నటి అపశ్రుతే; అపస్వరమే! ఎందుకో అతన్ని చూచినప్పట్నుంచీ తనకి ఆందోళన; ఆలోచన. బహుశః ఆ మొహం ఆందోళనావేదనలకు, ఆలోచనలకు ప్రతిరూపమేమొ! ఇలా పిచ్చిగా ఏమిటో ఆలోచిస్తూనే నిన్న ఏదో సాకుపెట్టి, కేసు వాయిదా వేసి, లేచి వెళ్ళిపోయాడు.

ఇక —

"నీది నేరమని ఒప్పుకుంటావా?" - ఎలాగో ఒకవిధంగా ప్రారంభించాలని సూటిగా ప్రశ్నించాడు ప్లీడరు.

ఆ యువకరక్తం ఉడికింది - ఉప్పొంగింది.

"నేరం?!" ఘట్టిగా పిచ్చిగా అరిచాడు దోషి.

జగన్నాధం అదిరిపడ్డాడు. కుర్చీలో ఓ మూలగా ఒదిగి తలెత్తి చూశాడు.

"నేరం? ఏది నేరం? నే చేసింది నేరమేనా?" — నేరస్థుని ప్రశ్నపరంపర కర్కశంగా తోచింది అతనికి. ఈసారి తనలోని హృదయాన్ని కోర్టువతలికి గెంటి దీక్షతో వింటున్నాడు జగన్నాధం.

యువకుడు ఉరకలేస్తున్నాడు.

"... మీరడగాల్సిన ప్రశ్న అదికాదు. 'నీ నేరానికి కారకులెవ్వర'ని అడగండి. అప్పుడు మీకు సిసలైన దోషి దొరికేవాడు. ఈ నా నేరానికి ముందు వెనుకలు నాకు తెలిసినంత మీకెవ్వరికీ తెలీదు. బాగా వినండి. విన్నతర్వాత నేరం మోపండి...

... మలమలమాడ్చే మండుటెండలో మడతలుపడ్డ కడుపుతో అతని గడప త్రొక్కిన వేళావిశేషమది. అతనిలా గాక నా స్థితి ఇంకా అధ్వాన్నంగా ఉందని పాపం అతనికి తెలీదు. అలాగయ్యుంటే ఈ పరిస్థితులేర్పడి యుండేవి కావు. అతని స్థితిగతుల గురించి మీకు తెలిసిందానికన్నా నాకింకా ఎక్కువ తెలుసు. నిర్దోషి తన నిర్దోషిత్వాన్నెంత గోడు పెట్టుకున్నా వినడానికింపుగా ఉండదు. ఐనా, నే నెఱిగిందంతా చెప్పక మానను.

కంపెనీలో అవకతవకలు చేశాడా 'నిర్దోషి' వెచ్చించిన డబ్బు సమర్పించుకోవాలి. అంతకాకపోయినా కొద్దో, గొప్పో ఉన్నవాడే. మరయితే, ఆ డబ్బేం చేశాడంటారా? "మద్యపాన నిషేధ సమితి' వాళ్ళకి, 'పోలీసు' వాళ్ళది ఆ పని. కంపెనీ వారు దయతలచి ఒకరోజు గడువిచ్చారు. అతని స్థితి అయోమయం - అగమ్యం. అప్పుడే తనిలా నేను దాపురించాను. అతని పరిస్థితి నాకు పూర్తిగా అవగతం.

"కంపెనీలో నౌఖరీ" — అని నేను నసిగాను. నాకున్న 'ఆశ' అంతా అతనిమీదే. అతనే నా నావకు చుక్కాని. ఆ చుక్కాని విరిగేలోపుగా, నా నావను ఒడ్డుకు చేర్చాలని నా ఉబలాటం.

"ఛీ, నడు అవతలకి" అని అతడు కసిరాడు. కాని నేను వదలని జిడ్డులాగ పట్టుకున్నాను. ఎంతకీ కదిలాను కాదు. అప్పటికే నా ఖర్మ పరిపక్వమైంది. అతడు రెచ్చిపోయాడు — మండిపోయాడు. కాని, మండిపోతున్న నా గుండెను, కాలిపోతున్న నా కడుపును గమనించలేదు.,

కోపంతో ఒక్క ఉరుము ఉరిమాడు. అతనిలోని బాధ, భయం, అవమానం అన్నీ నామీద కోపంగా మారాయని ఇట్టే గ్రహించాను. గజగజ వణికిపోయింది నా శరీరం. అతని రూపం ఇప్పటికీ నాకు భయంకరంగానే ఉంది. అతనిలోకి రాక్ష

సత్వం ప్రవేశించిందని అతని చూపులు నన్ను హెచ్చరించాయి బయటపడాలనే ప్రయత్నించాను. కాని... కాని, అప్పటికే వీపు చిట్లింది. బాధతో మూల్గుతూ తిరిగి చూశాను... అతని చేతిలో — రక్తంతో తడిసిన కొరడా! మరుక్షణమే మరో నాలుగు తగిలించాడు. మూర్ఛ వచ్చినంత పనయింది. తూలిపోయాను. వళ్ళంతా హూనమైంది. అబ్బ, ఆ బాధ అనుభవించాల్సిందే కాని..." — ఒక్క దీర్ఘమైన నిశ్వాసము వదిలాడు. ఒక్క క్షణం ఆగి మళ్ళీ ప్రారంభించాడు.

ఎప్పుడు ప్రవేశించిందో జడ్జిగారి హృదయం జగన్నాథం దేహంలోకి దూసుకెళ్ళింది.

"...అలాగే వీధిలో పడిపోయాను. నలుగురు పోగయ్యారు. ఎందుకు? వేడుక చూడ్డానికి! నేను దెబ్బలు తిన్నానన్న బాధేలేదు కాని, నా అభిమానం దెబ్బతిన్నందుకు సహింపలేకపోయింది. మూగిన జనం మూగజనంలా ఆ రుద్రుణ్ణి ఆపలేదు. రెచ్చిపోయిన నేను చేతికందిన బండతో తల పగిలేట్లు అతన్ని పడగొట్టాను. తర్వాత నేనేం జేశాను నాకు తెలీదు — మీకు తెలిసుంటుంది... కాని, దైవముపై ప్రమాణంచేసి చెపుతున్నాను. గడ్డకట్టిన నా హృదయం ఇప్పుడు ద్రవిస్తోంది; నాలాగే అతడూ ఓ మానవుడేనని నాలో కదుల్తున్న కరుణ స్ఫురింప చేస్తోంది; నాలో పశ్చాత్తాపం ఊరకలేస్తోంది... ఇదంతా నా నేరమేనా? ఇందులో ఎంత భాగం నా నేరం? నాకు విధింపబోయే శిక్షలో భాగం ఇంకెవ్వరికీ లేదా? ఈ న్యాయ స్థానం లో నిజమైన..."

"...ఆపు, మరీ మితిమీరకు. నీకు నీవే వాదించి న్యాయం స్థిరపరచుకొందుకు నీవిక్కడకు రాలేదు." — అని మధ్యలోనే అందుకున్నాడు కఠినంగా ప్లీడరు.

ఏదో మాట్లాడాలనుకున్నాడు జగన్నాథం. కాని, ఇంకేదో మాట్లాడేశాడు —

"కాని,...ఇది గమనించు... ఏదిచేసినా ముందు వెనుక లోలోచించాలి. నిన్ను కొట్టాడన్న నీవతణ్ణి చంపడానికి అర్హత నీకు లేదు."

మళ్ళీ దోషి మధ్యలోనే అందుకున్నాడు.

"...అది సాధ్యమేనంటారా? ప్రపంచ సామాన్యవిషయమే నంటారా? అదే సాధ్యమయితే లోకమంతా మహాపురుషులతో నిండిపోదూ? ఇంతెందుకు, ఈ నీతిని బోధించిన మీరు — క్షమించండి మొన్న ప్రొద్దుటి వృత్తాంతం మననం చేసుకోండి."

జగన్నాథం ఆకళింపుకు తెచ్చుకున్నారు. అతని ముఖకవళికలు తక్షణం ముడతలుపడి అసౌఖ్యాన్ని వెల్లడించాయి. ఒక్కసారి అవమానంతో కుంచించుకు పోయి, కుర్చీలో ముడుచుకుపోయాడు.

◆ ◆ ◆

ఆరోజు తను మడిపంచె మామిడిచెట్టుకి కట్టాడు. బావి దగ్గర స్నానంచేశాడు. పంచె ఇంకా ఆరలేదు. బయలు కాబట్టి — అందులో వయసు మళ్ళినవాడు కాబట్టి — చలిబుట్టి వణికిపోతున్నాడు. క్రితంరాత్రి భార్యతో కలహం, తత్కారణం, తత్ఫలితం యావత్తు జ్ఞప్తికిరాగానే వళ్ళంతా కోపంతో, కోపంతో ఒక్కఊపు ఊగిపోయింది... అంతంలేని ఈ కలహాలని తను తీర్చలేకపోతున్నాడు. తన పేరు ప్రతిష్ఠలకే ఎగ్గపెడుతోంది అది. నలుగురూ నాలుగు మాటలంటే ఇంకేముంది? ఛీ, రాత్రే చెప్పకుండా పుట్టింటి కెళ్ళిపోయింది. పుట్టిల్లు నాలుగో వీధైనా, భర్తకు చూపాల్సిన మర్యాదేనా చూపిందా? ఛీ, ఎవరేనా వింటే ఎంత అవమానం! కోపం రెచ్చిపోయింది... చెట్టు గలగలమంది. తను తల పైకెత్తి చూశాడు... న్యాయమూర్తి ఇంట్లోనే నేరమా? దండించకపోతే లాభం లేదనుకున్నాడు.

"దొంగకుంక! కాపు కాచిందంటే చాలం"టూ చేతికందే ఆ కుర్రాడిని దబుక్కున క్రిందికి లాగేశాడు. వళ్ళంతా ధూళితో నిండి, ఏలాటి సంస్కరణ లేని మానవాకారం ఆ కుర్రకుంకది. ఓ పన్నెండేండ్లుంటాయేమో!

క్రిందపడటంలో పాపం చేతియెముక విరిగింది. 'కుయ్యో' మన్నాడు.

"అయ్యగోరూ! ఇంకెప్పుడూ సేయనం"టూన్నా వినిపించుకోక పశువుల్ని కట్టే పలుపుతో బలంకొద్దీ బాదాడు.

నెత్తీ, నోరూ మొత్తుకున్నాడు పసివాడు.

'హుఁ' అని హుంకరించాడు తను.

హూనమైన లేత దేహంతో గోడెక్కాడు సగం చచ్చిన కుర్రాడు.

చెట్టుమీదనుండి క్రింద పడటంలో తెల్లటి మల్లెపూవులాంటి పంచెంతా మసిపూశాడు ఆ ఏ పాపం తెలీని అభాగ్యుడు. కోపం మరీ రెచ్చిపోయింది తనకి.

'ఏది చేసినా ముందు వెనుక లాలోచించాలి' - అన్న తన ప్రస్తుత సూత్రం ఆ స్థలిని మంటగలిపి, మండిపోయి, నలగిన శరీరానికి సేదనిస్తున్న పిల్లవాణ్ణి అంత ఎత్తునుండి అవతలకి దబుక్కున తోసేశాడు తను. తనెంత రాక్షసుడు!

ఆ తర్వాత జగన్నాథం ఏమీ ఆలోచించక, గబగబ స్నానం ముగించి, పట్టుపంచె కట్టి, తనకేమీ తెలీనట్టు - అసలేమీ జరగనట్టు - దినశేషాన్ని గడిపేశాడు.

♦ ♦ ♦

బోనులోని మనిషి ఇంకా వాగుతూనే ఉన్నాడు ఏమిటేమిటో.

"ఆ కుర్రాడెవరడు?" అని ఆత్రుతతో ప్రశ్నించాడు జగన్నాథం.

అక్కడెవ్వరికీ - మీకుమల్లే అది కోర్టనిపించ లేదు. "దేవుని పేరిట చెప్పు...ఆ కుర్రాడెవడు? ఎవరికేమౌతాడు?" ఏం తోచక, వణికే కంఠంతో ప్రశ్నించాడు జగన్నాథం.

"అయ్యో పాపం, ఎందుకంత జాలి? వాడు మీకేం కాడు, నాకే తమ్ముడౌతాడు" - దోషి కంఠంలో అవహేళన ప్రస్ఫుటించింది. అది మానవ సహజమే కదా! ఎదుటివారి పతనం వివరమైతే ఇవతలివారిది స్వేచ్ఛాపతంగ విహారమే కదూ?

"ఏకోదరుడా?" - జగన్నాథం గొంతుకలో ఎంతో కుతూహలం నిండింది.

"కాదు... కాని, ఏకోదరుడు కాని సహోదరుడు. నాలాగే అతనూ ఓ అనాథుడు, అనాథుడు. పోతున్న నా ప్రాణాన్ని - నాకెవ్వరూ చేయని కార్యం - గుక్కెడు నీళ్ళతో మళ్ళీ దానం చేశాడు. ఇప్పుడు వెళ్ళిపోయాడు."

"ఎక్కడికెళ్ళాడు? - ఎలాగున్నాడు? - ఇప్పుడెక్కడున్నాడు?" జగన్నాథం గబగబా ప్రశ్నించాడు పిల్లవాని స్వంత తండ్రిలా.

"హుఁ, ఎక్కడుంటేనేం, ఎలాగుంటేనేం? అంతా అయిపోయింతర్వాత?" - అతని కంఠంలో జగన్నాథానికి దైవఘోష వినిపించింది.

"అంత అయిపోయిందంటే?" - భయంతో వణికిపోయిందతని కంఠం. వళ్ళంతా స్వేద జలసిక్తమైపోయింది.

"...మీరనుకుంటున్నదే" - తాపిగా జవాబు వచ్చింది బోనులోంచి.

"చనిపోయాడా" - జగన్నాథం పశ్చాత్తాపం ఊహాతీతం.

"ఆ మాట నేననలేను."

"నిజంగా పోయాడా?... హే భగవాన్ నన్ను క్షమించు" అంటూ పశ్చాత్తాపంతో, పాపభారంతో టేబుల్ మీదికి అచేతనంగా వాలిపోయాడు జగన్నాథం. కోర్టులో కలకలం రేగింది; చలనం కలిగింది. పోలీసులు దోషిని బంధించి తీసుకుపోయారు.

జగన్నాథం ఇల్లు చేర్చబడ్డాడు.

♦ ♦ ♦

మరునాడు మళ్ళీ బోనెక్కాడు దోషి. తలెత్తి చూచి చలించాడు. ఈసారి జడ్జి జగన్నాథం కాదు. ఏదో క్రొత్తమొహం.

జనంలో ఎవరో పెద్దగా అనుకుంటుంటే విన్నాడు దోషి: "పాపం పాతజడ్జికి పక్షవాత మట."

విచారణ పూర్తయింది. న్యాయదృష్ట్యా దోషికి శిక్ష విధించింది కోర్టు.

కాని అసలు శిక్షలు విధించేది దేముడు.

# చెల్లి

"సాయినాథ శాస్త్రి"

చెల్లీ! చెల్లీ!! చెల్లీ!!!

నీకోసం నేనెంత ఏడుస్తున్నానో చూశావా? నువ్వు కావాలని నీకోసం ఎంతగానో ఆరాటపడి తపించిపోయాను. బుల్లిబుల్లి పాపాయిల్ని చూసినప్పుడల్లా నాక్కూడా ఒక చెల్లాయి వుంటే – అనిపించేది. అందుకనే చిన్నప్పుడు – అంటే నువ్వింకో సంవత్సరానికి పుడతావనగా నేను అమ్మని అడిగేవాణ్ణి – "అమ్మా! నాకు చెల్లాయి కావాలే!" అని. అమ్మ నేనడుగుతుంటే నవ్వి నన్ను కావలించుకుని గట్టిగా ముద్దుపెట్టుకునేది. మన ఎదురింటి పాపవాళ్ళ చెల్లి నెత్తుకుని అందరిళ్ళకీ వెళుతూండేది. నాక్కూడా అట్లాగే ఓ చెల్లాయి నెత్తుకుని తిరగాలనిపించేది. మనింట్లో అమ్మా, నాన్నా, తాతా అంతా గూడా పెద్దవాళ్ళేనయ్యె! నాతో ఆడుకునేవాళ్ళే లేరు. నువ్వే చెప్పు – అలాంటప్పుడు బాధగా వుండదు చెల్లీ? అందుకే నాతోపాటుగా ఆడుకునేందుకు నువ్వుంటే బాగుంటుందనిపించింది చెల్లీ!

అమ్మ ప్రతిరోజూ తులిసెమ్మ దగ్గిర పూజ చేసుకునేది. నేనుకూడా రోజూ అమ్మ పక్కనే కూచుని దేవుఁడికి దణ్ణం పెడుతూండేవాణ్ణి. ఓరోజున నాన్నారు అడిగారు – "బాబ్జీ! దేవుడికి ఏం కావాలని దణ్ణం పెడుతున్నావురా?" అని. నేను వెంటనే తపీమని చెప్పేశాను – "దేవుఁడూ! మరే! నాకో బుల్లి చెల్లాయినివ్వవూ!" అని దణ్ణం పెడుతున్నానని. నా మాటలు వింటంతోనే నాన్నారు నన్నెత్తుకుని నవ్వుతూ నా బుగ్గ గిల్లి ముద్దుపెట్టేసుకున్నారు. అసలు నాన్నారు ఎప్పుడూ అంతే! నేనేం చేసినా, ఏం అడిగినా నా బుగ్గలు గిల్లేసి ముద్దుపెట్టుకుంటూ వుంటారు చెల్లీ! ఎందుకో మరి నాకూ తెలియదు.

ఆరోజు రాత్రి నిద్ర మెలకువ వచ్చి లేచాను. అమ్మ కనిపించలేదు. అంతవఱకు ఎప్పుడూ నా దగ్గిరే పడుకునేది. నాకు భయంవేసింది. "అమ్మా!" అని గట్టిగా పిలిచాను. నాన్నారొచ్చి నన్నెత్తుకున్నారు. 'అమ్మే'దని అడిగాను. ఇంతలో కొట్టుగదిలోంచి ఎవరో చిన్నగా పాపాయిలాగా ఏడుస్తున్నట్టు వినిపించింది. గభాల్న నాన్నారి చేతుల్లోంచీ దిగి, గదిలోకి పరిగెత్తాను. గదిలోనేవున్న మంత్రసాని లక్ష్మి నావంక చూసి నవ్వుతూ "చెల్లి! బాబూ!" అంది. అప్పుడు నాకెంత సంతోషం కలిగిందని చెల్లీ! - చెప్పలేననుకో!

చెల్లీ! నువ్వెట్లా వున్నావని? గులాబీపువ్వల్లే వున్నావు. కళ్ళు తెరిచి చూస్తుంటే నాకెంతో సంబరమనిపించింది. నిన్ను చూట్టంతోనే నాకెక్కళ్ళేని సంతోషం వొచ్చేసింది. అప్పటికప్పుడే వెళ్ళి వాళ్ళందరితోటీ చెప్దామనుకున్నాను. కాని చీకటిగా! అందుకని ఆగిపోయా. ఆమర్నాడు ప్రొద్దున్నే పరిగెత్తుకెళ్ళి చెప్పేశాను చెల్లీ! నే చెప్పేది నిజం చెల్లీ!

అప్పటికప్పుడే నిన్నెత్తుకుంటానని అమ్మ నడిగాను. మంత్రసాని లక్ష్మి వొద్దని కోప్పడింది చెల్లీ! అయినా నాకు తెలియకడుగుతాను మా చెల్లిని నేనెత్తుకునేందుకు దాని ఆజ్ఞేమిటి నాకు? తనెత్తుకోవచ్చుటగానీ నేనెత్తుకోకూడదట ఎందుకనో! అక్కణ్ణుంచి వెళ్ళి నాన్నారితో చెప్పాను. నాన్నారు కూడా 'తప్పు తాకగూడ'దన్నారు చెల్లీ! నువ్వు కావాలని ఎంత ఆరాటపడిపోతున్నానో వాళ్ళకేం తెలుస్తుంది చెల్లీ!

రోజూ నీకు కణ్ణీళ్ళు కాగబెట్టి పోస్తుంటే నేనక్కడే కూచునేవాణ్ణి జ్ఞాపకం ఉందా చెల్లీ! ఆరోజు నీకు చురకలు పెడతారని తెలిసింది చెల్లీ! చురకలంటే నీకేం తెలుసూ? – సూదిని ఎఱ్ఱగా కాల్చి పొట్టమీద వాతలు పెట్టేస్తారన్నమాట! ఎంత ఘోరం! పొద్దున్నే మంత్రసాని లక్ష్మి వొచ్చి సూది కాలుస్తుంటే నే – అబ్బ చూళ్ళేకపోయా! నేను చెల్లికి వాతలొద్దని ఏడ్చాను. నా ఏడుపెవరన్నా వింటేగా! ఆరోజున నువ్వేడుస్తుంటే నా గుండెలు గుబగుబలాడిపోయినై. నిజంగా ఆరోజున అన్నమే తిన్లేదు నేను. నీకు బదులు నాకు చురకలు పెట్టమన్నాను. అంతా నవ్వేసి వూరుకున్నారు. నేన్నికన్నా పెద్దవాణ్ణేగా - పోనీ నాకు పెడితే ఏం? నామాట విన్లేదు చెల్లీ! నేను చూస్తూ వూరుకోవాల్సి వొచ్చింది. నేనే పెద్దవాణ్ణయినట్టయితే లక్ష్మిని చావబాదేవాణ్ణి. చిన్నపాపాయికి అట్లా వాతలు పెట్టచ్చా? దాన్ని దేవుడు తప్పకుండా శిక్షిస్తాడు. భగభగా మండే స్తంభాలికి అంటదీసి

కట్టాలి లక్ష్మని! నన్నడిగితే దేవుడి కడే సలహా యిస్తా! లేకపోతే యిట్టాంటి పన్లా చేసేది!

చెల్లీ! నిజం చెప్పొద్దూ - రాత్రిపూట నీమీద నాక్కోపం వచ్చేది చెల్లీ! రోజూ నేను రాత్రి పూట అమ్మ దగ్గిరే పడుకునేవాణ్ణి. నువ్వు పుట్టావు-మళ్లీ నేనమ్మ దగ్గిర పడుకోనేలేదు. అయినా, పోనీ లెమ్మని సద్దుకుపోయేవాణ్ణి. నువ్వు పాలకోసం ఏడుస్తుంటే అమ్మతో చెప్పి నీకు పాలు పట్టించేవాణ్ణి గుర్తుందా చెల్లీ! నీకు లాలపోసి. పౌడరద్ది వుయ్యాల్లో పడుకోబెట్టి వెళ్ళిపోయేది అమ్మ. నువ్వు నిద్రపోయేదాకా నీకోసం వుయ్యాల వూపుతూ వుండేవాణ్ణికాదు చెల్లీ?

ఎవరన్నా కొత్తవాళ్ళొచ్చి "బాబీ! మీ చెల్లాయిని మేం తీసికెళ్ళమా?" అనేవాళ్ళు! నాకు బలే కోపం వొచ్చేది. నువ్వు కావాలని దేవుణ్ణి రోజూ అడిగి, అడిగి సంపాదించుకున్నాను గదా!_ వాళ్ళట్టా అడిగితే నాకెట్టావుంటుందో నువ్వే చెప్పు మరి! నాకు తెలియకుండా నిన్ను తీసుకుపోతారేమో వాళ్ళెళ్ళిపోయేదాకా నిన్ను వొదిలి పోయేవాణ్ణే కాదు.

చెల్లీ! నువ్వూ, నేనూ వెన్నెల్లో కూచ్చుని అమ్మ పెట్టే బువ్వ తిందామనుకునేవాణ్ణి. నువ్వు పెరిగి పెద్దయితే నాతో బాటుగా బళ్ళోకి తీసికెళ్దామనుకున్నా. నా పలకా, బలపం, రంగురంగుల బొమ్మలూ, యింకా మరేమోనే నాన్నారు తెచ్చిన వూదే బూరా - అన్నీ నీకే యిద్దామనుకునేవాణ్ణి. నేను పెద్ద వుద్యోగంచేసి నీకు రకరకాల బొమ్మలూ, సిల్కు పరికిణీలూ, యింకా చాలా చాలా కొని పెడదామనుకునేవాణ్ణి. నిజం చెల్లీ! ఏమనుకుంటే ఏం?

చెల్లీ! ఆరోజు పాపిష్టిరోజు చెల్లీ! నీకు వున్నట్టుండి ఏదో జబ్బుచేసింది. అమ్మా, నాన్నా, తాతా అంతా కంగారుపడుతున్నారు. అమ్మ నడిగితే చెప్పలేదు. నాకేం తోచక, ఏడుపొచ్చింది చెల్లీ! రాదు మరి - నాకు నువ్వు వొక్కగా నొక్క చెల్లాయివి. నీకోసం నేనెంతగా ఎదురుచూశానో నీకేం తెలుసు? అందుకనే ఏడుస్తూ మన సందు చివరున్న డాక్టరు గారింటికి పరిగెత్తాను. మిట్టమధ్యాహ్నం అయినా నీకోసమని వెళ్ళాను. తలుపు కొట్టీ, కొట్టీ - పిలవగా, పిలవగా డాక్టరుగారి పెళ్లాం తలుపుతీసింది. డాక్టరు గారు కావాలని చెప్పి, మా చెల్లాయికి జబ్బు చేసిందని చెబుతూనే భోరున ఏడ్చేశాను. ఆవిడ చీదరించుకుని, డాక్టరుగారు నిద్రపోతున్నారని చెప్పి తలుపేసేసుకుంది. నా బాధ ఆవిడకేం తెలుస్తుంది! ఏం చేసేది? తిరిగి యింటికొచ్చేసరికి అమ్మ నిన్ను వొళ్ళో పెట్టుకుని ఏడుస్తూ వాకిట్లో కూచ్చుంది. నువ్వు కళ్ళు మూసుకునున్నావు. అమ్మ వంకన్నా కళ్ళెత్తి చూళ్ళేదేం చెల్లీ! నేనక్కడే నిలబడ్డాను. ఇంతలో నాన్నారొచ్చి నన్నెత్తుకుని

> నీకు తృప్తివుంటే, నీవు ఆనందంగా జీవితం గడపడానికి చాలా అవకాశాలున్నాయి. —"ప్లాటస్"
>
> ♦ ♦ ♦
>
> ఎందుకూ ఉపయోగపడని పనులలో గతించినదానికి ఏడవడం ఒకటి. —"చార్లెస్ డికెన్స్"
>
> ♦ ♦ ♦
>
> అదృష్టానికి తల్లి కష్టపడి పని చేయడం. —"బెంజిమిన్ ఫ్రాంక్లిన్"
>
> ♦ ♦ ♦
>
> ఇండ్లు అనేవి ఇతరులకు చూపించడానికి కాదు. మనము నివసించుటకే. —"ఫ్రాన్సిస్ బేకన్"
>
> ♦ ♦ ♦
>
> ఖర్చుపెట్టాక బాధపడే బదులు, ఖర్చు పెట్టడానిక్కి ముందుపడే బాధని "బడ్జెట్" అంటారు. —"వాల్టే"

నే రానంటున్నా వినకుండా దొడ్లోకి తీసుకుని పోయారు. ఇందులో నాదేం తప్పులేదు.

అంతే! మళ్ళీ కనిపించనేలేదేం చెల్లీ! లోకంలో అందరికీ చెల్లాయిలున్నారు - నాకే లేంది. ఉన్న ఒక్కదానివీ వొదిలిపెట్టి వెళ్ళిపోతే నేనేమయ్యేది! మళ్ళీ కనిపించవా? ఇక్కడికన్నా నువ్వెళ్ళిపోయిన చోటే బాగుందా? మాట్లాడవేం. సమాధానం చెప్పు చెల్లీ!

అమ్మా, నాన్నా నీకోసం బెంగపడిపోయారు,

వాళ్ళకన్నా ఒక్కసారి వొచ్చి కనిపించి పో చెల్లీ! నువ్వు రాకపోతే నేనెవరితో ఆడుకోవాలి చెప్పు మరి! చెల్లీ! అమ్మ మరీ అన్నం, నీళ్ళూ మానేసింది నీకోసం. ఇంతమందిని ఏడిపిస్తున్నావా? తప్పు కాదూ? అమ్మ దగ్గిర నువ్వు పడుకోకపోతే గదంతా బావురుమంటోంది. నీకోసం నేనెన్ని బొమ్మలు దాచానో చూద్దువుగాని రా చెల్లీ!

మొన్న ఓ రోజున అమ్మ నడిగాను - "చెల్లాయి ఎక్కడికెళ్లిం"దని. అమ్మ ఏడుస్తూ "దేవుడు తీసి కెళ్ళాడ"ంది. దేవుడింత చెడ్డవాడనుకోలేదు. నేను రోజూ నువ్వు కావాలని, నాతోపాటు ఆడుకోవాలని దేవుడికి దణ్ణాలు పెట్టేవాణ్ణి గదా! ఆమాత్రం దయవుండద్దూ! నిన్ను తీసికెళ్ళేప్పుడు నేనుండాల్సింది చెల్లీ! ఏమైనాసరే తీసికెళ్ళటానికి వీల్లేదని పోట్లాడేవాణ్ణి.

తాతయ్య ఎప్పుడో వోసారి చెప్పాడు- మంచి వాళ్ళ నందర్నీ దేవుడు తీసుకుపోతాడని. అయితే నేను మంచివాణ్ణి కానా? దేవుడికి నా మంచితనం గురించి తెలిసుండదు. నువ్వన్నా చెప్పు చెల్లీ! - "మా అన్నాయ్ కూడా మంచివాడే!" అని. అక్కడంతా మంచివాళ్ళేనా చెల్లీ! దేవుడు లేకుండా చూసి వో రోజున ఎప్పుడన్నా వొచ్చి పో! నేనుకూడా నీతోపాటే వొచ్చేస్తా. నువ్వు లేంది నాకేం తోచటంలేదు చెల్లీ!

దేవుడు నన్ను కూడా తీసికెళ్తే బాగుండును. అక్కడికొచ్చి నిన్ను తీసుకుని, మనింటికొచ్చి, అమ్మా, నాన్నల కప్పజెబుతాను. అల్లా కుదరదంటే నేనుగూడా అక్కడే వుండిపోతా. చక్కగా మన మిద్దరం ఆడుకోవచ్చు. దేవుడితో నా విషయం చెప్పటం మర్చిపోకు చెల్లీ! అక్కడి కొచ్చేప్పుడు నీకు యేం తెమ్మంటావో చెప్పి మరీ పంపించు దేవుణ్ణి. అవన్నీ తీసుకొస్తా. నేనుకూడా మంచివాణ్ణే నని చెబుతావుగదూ? మరిచిపోకు తొందరగా పంపించాలి చెల్లీ! చెల్లీ! చెల్లీ!

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



తల్లి శిశువుయొక్క దేహమును పోషించుటేగాక, పూర్వము వివరించినట్లు మానసికరక్షణ కూడ నొసగుచున్నది. తాను భుజించిన ఆహారముతో దేహమును పోషించుచున్నది. తన ఆలోచనల వికాసమువలన మానసికరక్షణ యొసగుచున్నది. ఆమె గర్భమునందుండు శిశువు, భర్తయొక్క సారము. కనుక, భర్త, భార్య గర్భమునందు రక్షింపబడి, వృద్ధిపొంది, నెలలు నిండుటతో, కుమారుని రూపమున బహిర్గతమగుటకు గల శ్రమనంతయు భార్య సహించుచున్నది. కనుక భర్త ఆమెకు కృతజ్ఞుడగుచున్నాడు. ఆమె గర్భమునందుండు శిశువును పోషించుచున్నది. కనుక, గర్భవతిగనుండు కాలమున, ప్రసవించిన వెనుక కూడ భర్త ఆమెను ప్రేమతో, పుష్టికరముగ పోషించుచుండవలెను.

ఇట్టి పవిత్రభావము సాధారపరచుకొని, హిందూమతమున, వివాహదాంపత్య మతిపావనమని యెన్నబడుచున్నది. వివాహమనగా, అంగాంగ సంభోగ వాంఛ తీర్చుకొనుటకై నియమించుకొను కట్టుదిట్టములని యెంచబడజాలదు. నేటికాలమున జనసముదాయము, విషయవాంఛాతురులై, లింగభేద విపరీత జ్ఞానమువలన, దుర్మంత్రణలవలన, ఆత్మహత్య చేసికొనుచున్నారను పరిజ్ఞానములేక, తమ నాశమునకు తామే కారణభూతులగుచున్నారు. వివాహదాంపత్యమున గల పవిత్రభావము తెలియని దోషమే దీనికి మూలకారణముగ నున్నది.

హిందువుల వివాహ మాంగల్యధారణ, ప్రేమ భవనమున, దైవమును, సత్యమును సాక్షులుగ నుంచుకొని, యజ్ఞభావముతో జరుపబడుచున్నది. వివాహదాంపత్యము నేడు సమకూర్చుకొని, రేపు విడిపోవునట్టి వ్యభిచార ప్రసంగము కాజాలదు.

అట్టి విపరీత భావములతో వ్యవహరించగల ప్రపంచము నెమ్మదిగా, మృగముల, వృక్షముల సంతతిలోనికి దిగజారిపోగలదు. మృగములందు, వృక్షములందు కూడ వాటి కనుకూలములగు నీతులు, నియమములున్నవి. అట్టిభావములు గల మానవ సమాజము, కుటుంబ నియామకములను (Family planning) సూత్రములెన్ని నియమించుకొనుచుండినను, కామాతురులై విచ్చలవిడి సంతానముపొంది, సంతానమును రక్షించగల యోగ్యతలేక, బాధ్యతల కోలుపోయి, వారిని బజారు సందులందు వదలివేయ గలరు.

వేదకాలమునందు స్త్రీలకు తగుమర్యాద చూపబడలేదనుట, శ్రుతిజ్ఞానము లేకపోవుటవలన, సంభవించును. స్త్రీలను, మోటారు సారథులుగ, పోలీసు బంట్రోతులుగ, సిపాయిలుగ, విమాన సారథులుగ నియమించవలెనని ఋషులు బోధించలేదు. కట్టెలు చీల్చుటకు, నీరు చేదుటకు వారిని నియమించియుండలేదు. కాని, వారివారి గృహములందు స్త్రీలు రాణులవలె నుండిరి. సంఘమున తల్లులు దైవస్వరూపులుగ నుండిరి. ప్రపంచమున నియామకులై యుండిరి. ప్రేమతో, విశ్వాసముతో, కనికరముతో, భక్తితో, వివేకముతో, పురుషులు స్త్రీలకు విధేయులై యుండిరి.

గృహస్థుడు, తన కుమారుని ప్రసవించిన తల్లిని, శ్రద్ధతో పోషించవలెననుట ఇందలి నీతి. ఆమె ఆ కుమారుని గర్భమునందు రక్షించియుండెను. తండ్రి శిశువును, గర్భమున యుండునపుడు, జన్మమెత్తిన వెనుక పోషించుట విధిగనున్నది. ఇచ్చట పోషించుట యనగ, దేహరక్షణయేగాక, మానసిక, వైజ్ఞానిక పోషణలు కూడ అన్వయమగుచున్నవి.

కనుక, శిశువుయొక్క శారీరక, మానసిక, వైజ్ఞానిక అభివృద్ధిని కలుగజేయుట తండ్రియొక్క ముఖ్య ధర్మముగ నున్నది. శిశువును తండ్రి పోషించుచున్నాడనగా, తన్నుతాను పోషించుకొనుచున్నాడు. తన యొక్క జీవమే శిశురూపమున యున్నది. మనము మన కుడిచేతిని పోషించుటయందు, ఎడమ కాలిని రక్షించుటయందు ఎట్టి ప్రత్యేక ప్రయత్నములు

చేయుటలేదు. అయినను, వాటికి ఆపద కలిగినచో, మనము బాధపడుచున్నాము. అదేవిధముగ, శిశువుకు విద్య నేర్పుట, బట్టలొసగుట, ఆహారమిచ్చుట మొదలగునవి కేవల ధర్మములనబడజాలవు, తండ్రి తనయుని రూపమున తాను ప్రకాశించుటకొరకు, తన సౌకర్యములను తాను నెరవేర్చుకొనుచున్నాడు.

అనగా, తండ్రి తనయునితో ఐక్యభావము పొందవలెననుట, గురూపదేశ సారము. ఈ భావము మనలో కుదిరినచో, మన మానసికవికాస మభివృద్ధిపొంది, బ్రహ్మాండమంతయు, అద్వితీయ, ఏకైక, బ్రహ్మస్వరూపమను వేదాంతభావము నెమ్మదిగ రూఢికాగలదు. వంటింటియందు గల అన్నపాకముల పేర్లల్ల వల్లించుటవలన, మనయాకలి తీరజాలదు. అదేవిధముగ, వేదాంత సూత్రములు కంఠస్థము చేసినంత మాత్రమున, బ్రహ్మ ఐక్యభావము కుదురజాలదు.

తండ్రికి, తనయునికి గల ఇట్టి సన్నిహిత సంబంధము గుర్తెరుగుట శ్రేయోభిదాయకము. గృహస్థులీ భావమును గుర్తెరిగి, ప్రవర్తించగలిగినచో, ద్వంద్వ స్వరూప బ్రహ్మాండమున కాధారమగు అద్వితీయ పరబ్రహ్మజ్ఞానము నెమ్మదిగ చేకూరగలదు.

గర్భమునందు చేరిన బీజము వృద్ధిపొంది, పిండమయి, కాలపరిపక్వమువలన, శిశువుగ బాహ్య ప్రపంచమున జన్మించుచున్నది. ఇది ఆ తండ్రికి రెండవ జన్మము. ఇచ్చట కుమారునికిని, కుమార్తెకు వ్యత్యాసమేమియు లేదు. పురుషులందు దైవాంశ మధికముగ నున్నదని వేదము తెలుపుటలేదు. తండ్రి, కుమారుని రూపమును, కుమార్తె రూపమును కూడ పొందుచున్నాడు. ఇరువురు అతని బీజమునుండియే వ్యుత్పత్తి పొందుచున్నారు. అతని వీర్యరసము, బీజరూపమున, గర్భవాసముపొంది, వృద్ధిపొంది, కాలానుగుణముగ శిశువై బయటపడుచున్నది. కనుక తండ్రి, రూపాంతరము పొందు పరివర్తనములలో శిశురూపము రెండవ అంతస్థుగ నున్నది.

శ్రు॥ సో ఽస్యాయ మాత్మా పుణ్యేభ్యః
ప్రతి ధీయతే. అథా స్యాయమితర
ఆత్మా కృతకృత్యో వయో గతః
ప్రైతి, య ఇతః ప్రయన్నేన పున
ర్జాయతే తదస్య తృతీయం జన్మ.॥
(4).

[తండ్రియొక్క ఆత్మరూపమగు కుమారుడు, పుణ్యకార్యములు నెరవేర్చు నిమిత్తము తండ్రి స్థానమున నియమింపబడుచున్నాడు. కుమారుని అపర స్వరూపమగు తండ్రి, కృతకృత్యుడై వయసు చెల్లుటవలన, మరణించుచున్నాడు. మరణానంతరమతడు మరల జన్మమెత్తుచున్నాడు. ఇది అతనికి తృతీయజన్మము.]

తండ్రి, కుమారుని గర్భవాసమున పోషించుచున్నాడు. పుట్టుటయందు పోషించుచున్నాడు. బాల్యావస్థయందు పోషించుచున్నాడు. అట్టి కుమారుడు, యుక్తవయసు వచ్చుటవలన, విద్యావంతుడై, వినయవిధేయతలు గలిగి, ఆరోగ్యవంతుడుగ నుండుటవలన, గృహమునందు తండ్రి స్థానమతడు వహించి, గృహధర్మముల నివర్తించుటకు నియమితుడగుచున్నాడు.

వంశాచారము ననుసరించి, బ్రాహ్మణుడు, ఇతర దైవికకార్యముల మూలముగ సంఘసేవ చేయుటకు తోడు, గృహమునందు యజ్ఞేశ్వర సంరక్షణజేసి ప్రత్యేక కర్మలు నిర్వర్తించవలసియున్నది. కుమారుడు యుక్తవయసు పొందుటతో, తండ్రి కర్మరంగమునుండి విరమించును. గృహస్థాశ్రమమున, నిత్య, నైమిత్తిక కర్మలను నెరవేర్చుటకు కుమారుని నియమించును.

దురదృష్టవశమున, నేటికాలమున, బ్రాహ్మణులు కూడ తమ నిత్య, నైమిత్తిక కర్మలను నెరవేర్చుటలేదు. వాటికి బదులు, మార్కెట్టుకు వెళ్లుట, దూరమునందుండు ఆఫీసునకు పరుగిడుట, ఏదోయొకవృత్తి నవలంభించి, జీవపోషణ చేసుకొనుటలో, కాలము పూర్తి చేసుకొనుచున్నారు. కనుక, శ్రుతివాక్యములు నేటికాలమునకు తగియుండలేదని తలచకూడదు. శ్రుతివాక్యము లెల్ల కాలముల కుపకరించు సత్యములు.

పై మంత్రభావముననుసరించి, తండ్రి, కుమారునికి విద్యగరపి, యుక్తవయసురాగనే, తన జీవిత వ్యవహారస్థానమున, కుమారుని నియమించి, తాను వ్యవహారములను విరమించుకొనును. ఒక వైద్యుడు తన చికిత్సాలయమున తన కుమారుని నియమించును. ఒక యంత్రాలయ యజమానుడు, తన కుమారునికి యాజమాన్య మొసగుచున్నాడు.

(సశేషము)

# శ్రీ సాయిబాబా భక్తుల అనుభవములు

'అమృతానంద'

భక్తివిశ్వాసములు మానవునికి ముక్తిని మాత్రమే కాక జీవయాత్రలో అనుక్షణం భగవంతుని అనుగ్రహ కటాక్షములకు పాత్రులుగా చేయుచున్నవి. అవతారమూర్తి సాయిబాబాను ఆరాధించి, సేవించి, స్మరించి అనేకమంది తమ కష్టాలను, దుఃఖాలను బాపుకొని మానసిక, శారీరక స్వస్థతను పొందుచుండుట గమనించతగినది. శ్రీ సాయిబాబా చాటినట్లు తన సమాధినుండి తన్ను శరణుజొచ్చినవారిని రక్షించి కాపాడుచూ వారిని సత్పురుషులుగా రూపొందించుచున్నాడు.

మద్రాసు నగరంలోని షెణాయ్‌నగరు నందలి సాయినిలయంకు ప్రతి గురువారం అనేకమంది శ్రీ బాబా ఆరాధనకు వస్తుంటారు. వారి అసంతృప్తిని, వారిలోని అశాంతిని పోగొట్టి స్వామి కేశవయ్యజీ శ్రీ సాయిబాబా అనుగ్రహకటాక్షములతో సుఖ సౌభాగ్యములను కలుగజేస్తుంటారు. శ్రీ బాబా అనుగ్రహకటాక్షములకు పాత్రులైన అనేకమంది భక్తులు తమ దివ్యానుభవాలను వెల్లడిచేస్తూ శ్రీ సాయిబాబా పట్ల భక్తివిశ్వాసములను ప్రోత్సహించుచున్నారు.

ఒక మలయాళీ యువకునకు చాలకాలం వరకు భగవంతుని పట్ల నమ్మకం తక్కువగా నుండేది. ఒకసారి అతని భార్య శ్రీ సాయిబాబా ఆరాధనకు సాయి నిలయంకు వచ్చింది. శ్రీ సాయిబాబా అనుగ్రహంవలన ఆమె భర్తకు ఉద్యోగంలో ప్రమోషన్ లభించింది. క్రమంగా కుటుంబపరిస్థితులు చక్కబడి పాట్నా M.A. పరీక్షలో కృతార్థుడైనాడు. అప్పటి నుండి ఆ దంపతులు భక్తివిశ్వాసములతో శ్రీ సాయిబాబాను ఆరాధించి పూజిస్తూ పరోపకారులుగా నుంటూ యున్నారు.

యువతీయువకులిద్దరు పరస్పరము ప్రేమానురాగాలతో వివాహమాడ సంకల్పించుకొని, తమ తల్లిదండ్రుల సమ్మతి సయితము లభించగలదనే నమ్మకంతో సాయినిలయంకు వచ్చి శ్రీ సాయిబాబా ఆశీస్సుల నర్థిస్తూ స్వామి కేశవయ్యజీని దర్శించారు. కాని ఆయన ఆ వివాహం జరుగనేరదని ఖచ్చితంగా చెప్పారు. తర్వాత మూడు నెలలకు ఆ యువకుడు ఆ యువతిని వివాహమాడుటకు బదులుగా కర్నూలుకు వెళ్ళి మరొక పిల్లను వివాహమాడాడు. స్వామీజీ దివ్యదృష్టి అనేకమంది భవిష్యత్ జీవితానికి మార్గదర్శకమగుతుంటుంది. మానవసేవను పరోపకారాన్ని ప్రబోధించే ఆయన బోధనలు భక్తులను ఉత్తములుగాను, ఆదర్శనీయులుగాను రూపొందించుచుండును. ఆయన ద్వారా లభించే శ్రీ సాయిబాబా ఆశీస్సులు, విభూతిప్రసాదములు దైనందిన జీవితంలో మానవకోటికి అమూల్యములుగా నొప్పుచున్నవి.

దొరిగల్లు, అనంతపురంలాంటి ప్రదేశాలలో సకాలంలో వర్షములు లేక త్రాగనీరు సయితం లేక ప్రజలు అలమటిస్తుంటే స్వామి కేశవయ్య పూజారాధనలు సలిపి, శ్రీ బాబా ఆశీస్సులతో దండిగా వర్షములు కురిపించి ప్రజల మన్ననల నందుకున్న సందర్భాలు గలవు.

బెంగుళూరు నుండి ఒక యువకుడు డాక్టరుగా విద్య నభ్యసించుటకు ఇంగ్లాండుకు బయలుదేరి వెళ్ళాడు. కాని అక్కడికి పోయినప్పటినుండి చదువుసాగక తానిక అక్కడ యుండలేననే అధైర్యము అతనిలో ప్రబలింది. అప్పుడు స్వామీజీ పంపిన శ్రీ సాయిబాబా విభూది ప్రసాదంతోటి, ఆశీస్సులతోటి అతనికి ఆత్మధైర్యం సమకూరి విద్యాభ్యాసం జయప్రదంగా సాగింది.

ఒక సామాన్య కుటుంబీకుడు పొరబాటున ఒక చిక్కుసమస్యకు గురియైనాడు. ఆ సమస్యను గురించి యితరులకు చెప్పుటకాని, యితరులను సంప్రదించుట కాని తన వ్యక్తిత్వానికి, ఆత్మగౌరవానికి భంగంగా పరిణమించింది. ఏమిచేయడానికి తోచలేదు. ఇంచుమించుగా పిచ్చివాడైపోయి అలమటిస్తుంటే అతని భార్య, బంధువులు సయితము అదేమిటో అర్థముకాక కంగారుపడసాగారు. అప్పుడు ఒక మిత్రుని సలహాతో స్వామీ కేశవయ్యజీని శరణుజొచ్చాడు. శ్రీ బాబా ఆశీస్సులు, విభూది పొట్లం స్వామీజీ ద్వారా లభించగా అతనికి మనశ్శాంతి ఏర్పడి సమస్య సయితం నీటిబుడగలాగ తేలిపోయింది. ఆయన ఆనాడు యీనాడు కూడ అచంచలమైన భక్తివిశ్వాసములు గల సాయిభక్తుడు.

ఒక భక్తునికి ఏ క్షణానికాక్షణం తన ఉద్యోగ నిర్వహణలో చిక్కులు ఏర్పడుతుండేవి. ఆయనకు దరి, డొంక తెలియని పరిస్థితులలో స్వామీజీ ప్రసాదించిన విభూది పరిస్థితులను చక్కబరచి మనశ్శాంతిని కలుగజేసింది.

ఒక భక్తుడు నియమప్రకారం 9 నెలలు సాయిబాబా విభూది పొట్లమును దగ్గర నుంచుకొని ఆరోగ్యవంతుడై, తన కుటుంబములో మానసికంగా, శారీరకంగా ఎట్టిలోట్లు పొడచూపినా స్వామి కేశవయ్యజీ ద్వారా శ్రీ బాబా అనుగ్రహకటాక్షములకు, విభూదికి సాయినిలయంకు వస్తుంటాడు. అనేక వ్యాధులతో బాధపడుతూ వచ్చి సాయినిలయంలో శ్రీ సాయిబాబా సమక్షంలో విభూది స్వీకరించి, స్వామీజీ సలహాలను, సూచనలను పాటించినచో స్వస్థత చెందుదురు.

మరొక భక్తుడు తన ఉద్యోగ నిర్వహణలో అవాంతర పరిస్థితులు ఏర్పడి బర్తరఫు అయ్యే పరిస్థితులు ఏర్పడగా స్వామీ కేశవయ్యజీ విభూది పొట్లమును, సూచనలను స్వీకరించి తన కృతజ్ఞతను తెలియజేశాడు. ఆయన శ్రీ సాయిబాబాను స్మరించినప్పుడెల్ల తాను సాయినిలయంలో నున్నట్లే భావించుచుండునని తెలియజేస్తుంటాడు.

ఈవిధంగా అనేకమంది భక్తుల అనుభవాలు వినుటకు, చదువుటకు ఎంతో ఉత్సాహంగాను, ఆసక్తి కలిగిస్తూయుంటవి. మానవసేవయే మాధవసేవగా ఎంచి చేయుచున్న స్వామీ కేశవయ్యజీ సేవాకార్యక్రమము, పూజారాధనలు అనేకమంది జీవితములలోని చీకటిని పారద్రోలి ప్రకాశవంతముగా చేయుచున్నవి. దివ్యత్వాన్ని, సుఖసౌభాగ్యాలను ప్రోత్సహిస్తూ ఆయన పంచిపెడుతున్న శ్రీ బాబా ఆశీస్సులు, విభూది ప్రసాదములు ముమ్మాటికి అమూల్యములు.

---

## వివాహ మహోత్సవములు

శ్రీ రాజరాజేశ్వరి ఫిలిం కంపెనీ దర్శక నిర్మాత శ్రీ కడారు నాగభూషణంగారి కుమార్తె చి॥ సౌ॥ కృష్ణవేణికి, చి॥ జి. సత్యనారాయణకు యీ నెల 7వ తేదీన వివాహం జరిగింది. ఈ సందర్భమున తేనీటివిందు, నృత్యప్రదర్శనము, హరికథాకాలక్షేపం, శ్రీ హనుమచ్ఛాస్త్రిగారి రామాయణ ప్రసంగము రెండు రోజులు ఏర్పాటు చేయబడినది.

ఆదేరోజున సినిమా నటుడు, నాటకరంగంలో ఉత్తమ నటుడుగా పేరు గడించిన ఫింగర్ ఫ్లూట్ కే. రఘురామయ్యగారి కుమార్తె సౌ॥ వెంకటసత్య కృష్ణప్రసన్నకుమారికి, చి॥ పార్వతీశ్వరరావుకు వైభవంగా వివాహం జరిగింది. రాత్రి 7 గంటలకు పాటకచ్చేరి, విందు జరిగినవి.

పై రెండు చోట్లకు అశేష బంధుమిత్రులు, సినిమా నటీనటులు, నిర్మాతలు, దర్శకులు వచ్చి పెండ్లి బహుమతులతోబాటు వధూవరులను అభినందించి, ఆశీర్వదించారు.

ఈ సందర్భమున నూతన వధూవరులకు ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించునట్లుగా భగవంతుని ప్రార్థిస్తూ వారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము.

# రిహార్సల్స్

జిరోమిర్ పెసెక్

విద్యుద్దీపాల కాంతిలో ప్రేక్షకులముందు నర్తకీ నర్తకులు ప్రదర్శించనున్న కొత్త నృత్యం తయారవుతున్న స్టూడియోలోకి వెళ్ళి చూసినట్లయితే నిజంగా ఆ వాతావరణం ఎంతో ఆకర్షణీయంగా వుంటుంది.

నృత్యబృందం రిహార్సల్ జరుగుతున్నప్పుడు చూస్తే తమ విరామకాలాన్ని ఐచ్ఛికంగా కష్టమైన పనికి వినియోగించే ఆ కళాకారుల పట్ల గొప్ప గౌరవం ఏర్పడుతుంది. నృత్యాలు అభ్యాసం చేయాలి, నృత్యకళ అధ్యయనం చేయాలి మరి. రంగస్థలంమీద ఒక క్షణంలో ప్రదర్శింపబడే భంగిమను ఒక నూరుసార్లు మళ్ళీ మళ్ళీ అభ్యాసం చేయాలి, ఒక అడుగు సరిగ్గా వేయడానికి ఒక వెయ్యిసార్లు ప్రాక్టీసు చేయాలి. ప్రతి కదలిక సరిదిద్దుకోవడం చాల కష్టమైన పని. కఠినమైన క్రమశిక్షణ నుండి సౌందర్యమూ, నమ్రతనుండి, ఓరిమినుండి, పట్టుదల నుండి కళలు వుద్భవిస్తాయి.

ప్రాగ్ కార్లిన్‌లోని ప్రాంతీయ బాలసంఘ భవనంలోని ఒక పెద్ద నృత్య కళామందిరంలో సుమారు నలభై మంది బాలబాలికలు సభ్యులుగావున్న కేంద్ర బాలసంఘ ఔత్సాహిక నృత్యబృందం వారానికి రెండు మూడుసార్లు యిక్కడ రిహార్సల్స్ వేస్తూవుంటుంది. పియానో వాద్యకారుడు ఒక గీతం మళ్ళీమళ్ళీ వాయించాడు. నృత్యబృందం నాయకురాలు జార్కా పొపెలోవా, బాలికలకు కొత్త నృత్యం నేర్పుతున్నది. ఆమె అనుభవజ్ఞురాలైన నృత్యకళాధ్యాపకురాలు. ప్రజల సృజనాత్మ కళా పోటీలలో నృత్యకళ పోటీ జ్యూరీలో చాలకాలమై సభ్యురాలుగా వున్నది. ఆమె తన విద్యార్థినులకు పదేళ్లుగా నృత్యకళలో శిక్షణ ఇస్తున్నది,

ఒకగంట గడిచింది. ఆ అల్లకల్లోలమంతా (మాకు అలాగే అనిపించింది మరి) క్రమంగా మెల్లగా ఒక నృత్యంగా రూపొందింది. అది ఒక చెక్ జానపద నృత్యం. అయితే రంగస్థలానికి అనుకూలంగా ఒక ప్రత్యేక శైలిలో వుందా నృత్యం.

ఈ బృందం సభ్యులలో మంచి ఐక్యతవుంది. చెకొస్లొవాకియాలో వున్న 30,000 నృత్యకళా బృందాలలోవలెనే, యిక్కడకూడా బాలలకు సమిష్టిగా జీవించటమూ, సమిష్టి కృషిలో ఆనందించడమూ నేర్పుతారు. వారికి కళాసూత్రాలు నేర్పుతారు, ఆచరణలో కూడా కళాపరిచయం కల్పించబడుతుంది. వారు సమిష్టిగా నాటకశాలలకూ, సంగీత నృత్యప్రదర్శనాలకూ వెళ్తారు. భావిమానవుని రూపురేఖలు వారి కృషిలో గోచరమవుతాయి. సమష్టికృషి ఆశయం - వీటిమూలంగా వ్యష్టితత్వం, దురాశ, స్వార్థపరత్వం, ఈర్ష్య పటాపంచలయాయి. అది అంత సులభసాధ్యమైన పనికాదు. అయితే ఏదైనా సాధించతలచుకున్నప్పుడు అవరోధాలను దాటడం కష్టంకాదు.

ఈ బృందం సాధించిన విజయాలు చాల సంతృప్తికరంగా వున్నాయి. ఈ బృందం జీవితంలో ముఖ్య ఘటనలను తెలియజేసే ఛాయాచిత్రాలు స్టూడియోలో వున్నాయి. వారు చేసిన స్వదేశ, విదేశయాత్రలు, ప్రాగ్ భవనంలో రిపబ్లిక్ అధ్యక్షునితో సమావేశం, వీటి ఛాయాచిత్రాలు, వేరువేరు నృత్యాల ఛాయాచిత్రాలు - అంటే మాస్కోలో ఘనవిజయం సాధించిన "మూవ్" అనే స్లోవక్ నృత్యం, దక్షిణ బొహిమియన్ నృత్యం, తూర్పు బొహిమియన్ నృత్యం మొదలైన నృత్యాల ఛాయాచిత్రాలున్నాయి. ఈ నృత్యాలన్నిటికీ పోటీలలో బంగారు పతకాలు లభించాయి. చెకోస్లొవాక్ బాలల సంఘం _ యంగ్ పయొనర్స్‌లో చేరినప్పుడు బాలల సంతోషాన్ని వ్యక్తంచేసే "ప్రామిస్" అనే నృత్యం ఎంతో జయప్రదమైంది. తమ దేశసౌభాగ్యానికి దోహదం చేయదలచుకున్నట్టి, సామ్యవాద భవిష్యత్తును నిర్మించడంలో తాముగూడా పాల్గొనదలచుకున్నట్టి యీ బృందం సభ్యుల లక్ష్యానికీ, సాధనకూ యీ నృత్యం ఒక చక్కటి దృష్టాంతం.

# సంపాదకీయములు

## స్త్రీ విద్య - మహిళాభ్యుదయము

స్త్రీ విద్యను గురించి ఆసక్తి బాగా పెరిగిందనే చెప్పాలి. స్త్రీలకు విద్య అనవసరమని కాని, పరిమిత విద్య చాలునని కాని వాదించేవారు యింకాయున్నా ఆ వాదం యిప్పుడు పేలవమయిపోయింది. ఉద్యోగ బాధ్యతల నిర్వహణలో పురుషులతో సమానంగా స్వీకరించవలసిన అవసరాన్ని ప్రజలు క్రమంగా గుర్తిస్తున్నారు. విద్యావిధానం స్త్రీలకనువుగా సంస్కరించబడి, జాతీయబాధ్యతల నిర్వహణలో భాగస్వాములగుటకు వీలుగా రూపొందితే యింకా యీనాడు స్త్రీ విద్యపైనున్న మూఢనమ్మకం తొలగిపోతుంది; విశేషంగా బాలికలు విద్యావంతులవుతారు.

ఇదే సందర్భమున పరిపాలనలో శిక్షణ నీయుటకు ఉత్తర, దక్షిణ భారతదేశాలలో రెండు సంస్థలను తృతీయ ప్రణాళికా కాలంలో నెలకొల్పాలని ఇందిరాగాంధీ సంఘం సూచించింది. ఈ సూచన ముమ్మాటికి సముచితమయినది. విద్యాయోగ్యతలతో బాటు సుశిక్షణ పరిపాలనా దక్షతను సమకూరుస్తుంది. వాస్తవానికి యిట్టి సంస్థలు పురుషులకు సయితము అవసరమేమో ననిపిస్తుంటుంది. ఎందుకంటే ఏదోవిధంగా ప్రజాప్రతినిధులుగా మాత్రం అనేకులు శాసనసభలకు ఎన్నిక అగుతున్నారు కాని పరిపాలనా వ్యవహార పరిజ్ఞానంకాని, దక్షతకాని బహుస్వల్పం. స్త్రీలైనా, పురుషులైనా పరిపాలనా దక్షతను సంపాదించడం అత్యవసరము.

## వరకట్నాల నిషేధం - చట్టం

ఎలాగైతేనేమి వరకట్నాల నిషేధం బిల్లు తర్జనభర్జనలతో, హేమాహేమీలు వ్యతిరేకించినా ఉభయపార్లమెంటుల సమావేశంలో ఏకగ్రీవంగా ఆమోదించబడి చట్టమయింది.

ఈ చట్టము ననుసరించి వరకట్నములడిగేవారిని, పుచ్చుకునేవారిని, యిచ్చేవారిని శిక్షించుట కవకాశమున్నది. అయితే వివాహ సందర్భమున నగలరూపంగా, వస్తురూపంగా, ధనరూపంగా వధూవరులకు వచ్చే చదివింపులు వరకట్నంగా పరిగణింపబడవు.

ఈ చట్టం అమలు జరిగే సందర్భమున అనేక శంకలకు అవకాశములున్నా మొత్తంమీద వరకట్నాల పేరుతో బాహాటంగా ఎదటివారి ఉండిలేములు పారజూడక దోపిడి సాగించపూనుకునే వరుల, వరుల తల్లిదండ్రులకు అవరోధం ఏర్పడింది.

ఈ చట్టాన్ని సద్భావముతో స్వీకరించి వివాహంకాని కన్యలకు వివాహావకాశములు మెరుగయ్యేలాగ చూడటం అత్యవసరం. కట్నం అడుగడం, పుచ్చుకోడం, యివ్వడం సందర్భమున వధువు, ఆమె తల్లిదండ్రుల సాక్ష్యం తమ క్షేమదృష్ట్యా లభించదు కనుక యీ చట్టం తమను శిక్షించజాలదని అప్పుడే కొందరు వరులు, వరుల తల్లిదండ్రులు భావిస్తున్నారు.

కొందరు వివాహసందర్భంలో ఎలాగూ చదివింపులుంటవి కాబట్టి లాలూచీగా ఏదోరూపంగా కట్నం మొత్తాలను లాగవచ్చని, తమరీ చట్టమును చూచి భయపడనవసరంలేదని మరికొందరు గుటకలు మ్రింగుతున్నారు.

ఈ సందర్భమున ముఖ్యంగా వరకట్నాల నిషేధచట్టం కట్టుదిట్టంగా నమలుజరుగుటకు సామాన్యప్రజల సహకారం అత్యవసరం. ఆడపిల్లలు, తల్లిదండ్రులు అవసరమయితే వీరోచితంగా పోరాడుటకు, త్యాగం చేయుటకు పూనుకోవాలి! చట్టం అమలులోనికి వచ్చిన తరువాత సయితం తమను వంచించి దొడ్డిదారిన కట్నాల మొత్తాన్ని గుంజజూచే వరులను, వరుల తల్లిదండ్రులను పరిణామాలను లెక్కచేయకుండా రచ్చకెక్కించి శిక్షార్హులుగా చేయాలి. అది ధైర్యసాహసాలతో కూడిన పనియైనా అట్టి గుణపాఠం ప్రజలలో చైతన్యం కలిగించి చట్టం ఫలవంతంగా అమలుజరుగుతుంది. ఆచార్య కృపాలినీ పార్లమెంటులో చెప్పినట్లు యీ చట్టం దృష్ట్యా తమకు న్యాయం కలుగని పరిస్థితులలో స్త్రీలు, ఆడపిల్లల తల్లిదండ్రులు సత్యాగ్రహమునకు, అవసరమయితే నిరశనవ్రతానికి ఆయత్తం కావాలి.

ఈ చట్టం రూపొందినంత మాత్రాన వరకట్న నిషేధం ఉద్యమ ఆవశ్యకత తీరిపోయిందనుకోడం పొరబాటు ఎత్తుకు పై ఎత్తుగా చట్టం ఉల్లంఘించ సాహసించేవారిని అదుపులో పెట్టడానికి ప్రభుత్వముతో బాటు ప్రజలు సహకరించాలి!

ఈ చట్టం రూపొందిన సందర్భమున సద్భావంతో సంస్కరణాభిలాషులుగా జాతీయశ్రేయస్సు నుద్దేశించి వరకట్న నిషేధం బిల్లును సమర్థించినవారు అభినందనీయులు. మహిళా ఉద్యమానికిది యొక ఘన విజయము. ఆదేశమంతంలో మహిళాలోకానికి మొత్తంగా యీ చట్టం ఉపయుక్తం అయ్యేలాగ ఆసక్తితో కృషి సల్పవలసిన బాధ్యత మహిళాసంఘాల కున్నది.

## గురుదేవ్ రవీంద్రనాథటాగూర్ శతజయంతి

శ్రీ రవీంద్రనాథటాగూరు కవి, గాయకుడు, నటుడు కూడాను. అంతేకాదు ఆయన రచనలలో ఆయన విశాలహృదయం ప్రతిఫలిస్తుంటుంది. ఆయన రచనలలో కళ, భావపుష్టితోబాటు విశ్వమానవ ప్రేమ, జాతీయత ప్రబోధించాడు. ఆయన మహోన్నత ఆశయాలకు ప్రతిబింబం విశ్వభారతి. ఆయన అంతర్జాతీయ ఖ్యాతి గాంచి నోబెల్ బహుమతిని బడసినట్టి పూజ్యుడు. శ్రీ టాగూర్ శతజయంతి ఉత్సవాలను ప్రపంచం మొత్తంమీద జరుపుకొంటున్న జరుపుచున్న సందర్భమున వారికి మా భక్తిపురస్సరమైన శ్రద్ధాంజలి! ఆయన ఆదర్శలక్ష్యాలు మనదేశానికి, ప్రపంచానికి కూడ వెలుగుబాట కావాలి!

---

# గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదాన ఉత్సవము

గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము, కీ॥ శే॥ డాక్టరు కే. యన్ కేసరిగారి జన్మదినోత్సవము ఏప్రెల్ 26వ తేదీన జరిగినవి. డాక్టరు కేసరిగారి పుత్రిక శ్రీమతి శారదాదేవి స్వర్ణకంకణమును శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్‌కు బహూకరించి సన్మానించారు.

గృహలక్ష్మి సంపాదకుడు శ్రీ సి. సి. పున్నయ్య కంకణ గృహీతను అభినందిస్తూ డాక్టరు కేసరిగారు మహిళాభ్యుదయాన్ని ప్రోత్సహించుటకని యీ కంకణ ప్రదానమును ప్రారంభించి, నిర్వహించిరనియు, ఆయన తర్వాత సయితము యీ కంకణ ప్రదానము జరుగుటకు పదిలమైన ఏర్పాటు చేసిరనియు చెప్పుచూ, కేసరిగారి జన్మదినం తమకు పర్వదినమనియు, వారు తమకొసర్చిన సహాయమునకు, వారి ఆదరాభిమానములకు కృతజ్ఞతను తెలిపి వారిపట్ల భక్తి విశ్వాసములను తెలియజేయుటకు మహదావకాశమనిరి.

కంకణ గృహీతను గురించి చెప్పుచు ఆమె విదుషీమణి, రచయిత్రి మాత్రమే కాక సుప్రసిద్ధ సంఘ సేవకురాలు, జాతీయవాదియగు కీ॥ శే॥ యామినీ పూర్ణతిలకమ్మగారి కుమార్తె యనియు, ఈమె బాలల సాహిత్యంలో పరిశోధనాత్మకమైన కృషి సలుపుచు రచనలు సాగిస్తున్నారనియు, ముందుముందు మరింత అమూల్యమైన, ఆకర్షణీయమైన బాలల సాహిత్యాన్ని రూపొందించగలరని ఆశిస్తున్నామని యనిరి.

శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్ తనకీ కంకణ ప్రదాన సన్మానము జరిపినందుకు కృతజ్ఞతను తెలుపుతూ తనకు డాక్టరు కేసరిగారు పితృతుల్యులనియు, ఆయన ఆదరాభిమానములు తమకు చిరపరిచితములనియు, తమ తల్లిగారు 'హిందూ యువతీ శరణాలయము'ను స్థాపించి, నిర్వహించ తలపెట్టినప్పుడు డాక్టరు కేసరిగారు చూపిన ఆసక్తి, చేసిన సహాయము అపారములని, కేసరిగారు ఆరోగ్యాభివృద్ధి నుద్దేశించి తమ తల్లిగారి తాంబరం ఆశ్రమంలో నివాసమేర్పరచుకున్నప్పుడు ఆయనతో ఏర్పడిన పరిచయం మరపురానట్టిదనిరి.

కేసరిగారి మహిళాభ్యుదయాన్నుద్దేశించిన సేవ, సహాయసహకారములు ప్రతిఫలమును ఎదురు చూడకుండా జరిగినవనియు, ఆయన చేసిన సహాయం, ఆయన నిర్వహించ పూనుకొన్న కార్యక్రమము తటపటాయింపు లేకుండా మహిళా ఉద్యమవ్యాప్తికి, అభివృద్ధి అభ్యుదయాలకు ఉద్దేశించబడినవనియు, కాబట్టే ఆయిన ప్రోత్సాహం విశిష్టమైనదిగా నొప్పినదంటూ సాహిత్యరంగంలో ఉదతాభక్తిగా తనబోటి నారీమణులు చేయుచున్న సేవాకృషులను గుర్తించి సన్మానించుటకు ఏర్పడిన యీ గృహలక్ష్మి కంకణం డాక్టరు కేసరిగారిని చిరస్మరణీయులుగా చేసినదనియు, ఇంకా ఈ సన్మానము మరింతగా ప్రోత్సహించి ఉత్తమ రచనలను వెలువడచేయగలదనియు, తాను సయితం శక్తివంచనలేక ఉత్తమస్థాయికి చెందిన బాలల సాహిత్యమును రూపొందించుటకు కృషి చేయగలనని చెప్పారు.

ఎప్పటియట్లు కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్ ఉద్యోగ పరివార బృందమునకు అన్న, వస్త్ర ప్రదానములు జరిగినవి.

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah. Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10 6 ఔ॥ రు. 5-50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

## కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్, మైసూరులకు ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు, బెంగుళూరు

60

సంవత్సరాలుగా
స్త్రీ జనులతో
సన్నిహిత
బాంధవ్యము
కలది




లోధ్ర

స్త్రీల ఆరోగ్య
సౌభాగ్యములకు

కేసరి కుటీరం
ప్రైవేట్ లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14.

SISTA'S